


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్‌ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రముంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి. ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**
అమోఘమగు
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL

## లోకం పోకడ – ఊమెన్

చైనా

స్నేహపూర్వకమైన కలయికకి ఆ తలుపు తెరుచుకుంటుందని ఆశిస్తున్నాను!

భలే! ఫరాక్కా పై భారత్-బంగ్లా చర్చలు విఫలమయ్యాయి. సమితిలో మనకి కావల్సినంత కాలక్షేపం

బంగ్లా

అంటరానితనాన్ని తీవ్రంగా ఖండిస్తున్న ఆ మహావక్తని చూశారా? అతనే నేను హరిజనుడినని తనింట్లో పనివ్వడానికి నిరాకరించిన పెద్దమనిషి




ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 1–10–'76
నలనామ సం. ఆశ్వీయుజ శు. అష్టమి:
**సంపుటము 70 : సంచిక : 5**

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60
" ఆరుమాసాల చందా రు. 20–80
విడి పతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.

---

## విషయానుక్రమణిక

రూ. 19,04,000
విలువగల 51,367 నగదు బహుమతులు
6 శ్రేణులలో

# బంపర్ 10-10-76

గొప్ప బహుమతి
# రూ. 5,00,000

6 ప్రథమ బహుమతులు
## రూ. 1,00,000

6 ద్వితీయ బహుమతులు
## రూ. 10,000

30 తృతీయ బహుమతులు
## రూ. 1,000

84 చతుర్థ బహుమతులు
## రూ. 500

840 పంచమ బహుమతులు
## రూ. 100

8400 షష్ఠమ బహుమతులు
## రూ. 20

42,000 సప్తమ బహుమతులు
## రూ. 10




రూ. 1/- ప్రతి టిక్కట్టు

# కర్ణాటక
## రాష్ట్ర లాటరీ

MCA-MSIL-64 Tel

"శారదగారూ ! ..."

శారద మంచం మీద నుంచి తటాల్నలేచి నించుంది. చెదిరిన జుత్తు నుదుటిమీద పడుతూ, నలిగిన చీరతో, శోకదేవతలావున్న శారద ప్రవీణను చూస్తూ, మొగం కాస్త చిట్లించుకొని కిటికీవైపు తిరిగిపోయింది.

"శారదగారూ! తప్పు లేకపోయినా మిమ్మల్ని క్షమించమని కోరుతున్నాను. భాస్కర్‌గారు గాని నేనుగాని, ఏ నేరం చేయలేదు. భాస్కర్ గార్ని వెంటనే రమ్మని ప్రాధేయపడుతూ మీరు జాబు రాయాలి."

శారద విరుచుకు పడింది. "అయితే ఆయనను ఈ దేశం నుంచి తరిమినది నేనా ?–"

"మీరనికాదు. అతని చుట్టూవున్న పరిస్థితులే కావచ్చు. ప్రస్తుత సమస్య గురించి ఆలోచించండి. ప్లీజ్. భార్య అయిన మీరు ఆయనను అభ్యర్థించిలే తప్పు విషయం సానుకూలపడదు" అంది ప్రవీణ ఓర్పుతో.

"మీరేమీ చెప్పనవసరంలేదు. తక్షణం ఇక్కడి నుంచి వెళ్లండి. ఇంకా వుంటే ఏమైనా చేసేస్తాను."

"ఇంతేనా మీ సమాధానం ?"

"ఇంతే."

"సరే వెళ్తాను. భాస్కర్‌గారు తిరిగివచ్చే ప్రయత్నం నేనే స్వయంగా చేస్తాను."

* * *

దూరంనుంచి ప్రవీణ కారు చూస్తూనే కుర్రకారు రాళ్ళు విసరసాగారు.

సీరియల్

# హీరో

పి. రామలక్ష్మి

*(గత సంచిక తరువాయి)*

విలాగో పోర్టికో వద్దకు వచ్చి ఆగింది కారు.

"ఆగండి! భాస్కర్‌గారు తిరిగి వచ్చేలా సాయశక్తులా ప్రయత్నిస్తాను. ఆవేశపడి మీ అగ్రనటుడి అభిమానం పోగొట్టుకోకండి." అని కారు దిగి అర్థించింది ప్రవీణ. ఆమె మాటలు దగ్గరున్న వాళ్లకి మాత్రమే వినిపించాయి.

దూరం నుంచి మట్టి బెడ్డలు దువ్వుతూనే వున్నారు. ఒక ముక్క ప్రవీణ కారు సైకి వచ్చిపడి ధ్వంసం చేసింది.

ప్రవీణ మోము కందగడ్డలా అయింది.

జనం అంటే ఆమెకి మొదటిసారిగా అపరిమితమైన కోపం వచ్చింది. పమిట నిండుగా కప్పుకుని తలవంచుకుని, విసవిస తన భవంతిలోకి వెళ్లి తలుపులు బిగించుకుంది. పోలీసు వారికి ఫోను చేసింది రాత్రి జాగ్రత్తకు.

## 17

అమెరికాలో కాలిఫోర్నియాలో వున్న భాస్కర్‌బాబు పేర ఉత్తరాలు, కేబుల్స్ గుట్టలుగా వచ్చి పడున్నాయి; వాటన్నిటిలో ప్రత్యేకమైన రెండు ఉత్తరాలకోసమే అతని కళ్లు నిరీక్షిస్తున్నాయి. తన అడ్రసు మొదటగా కనుక్కున్నవాళ్లెవరో తెల్సుకోవాలనిపించింది.

కాలిఫోర్నియాలో ప్రశాంతంగా హాయిగా వుంది. ఇండియన్స్ ఎవరూ అతన్నింతవరకు గమనించలేదు. భారతీయులు ఇల్లు వదలి బయటికి రావడం అంతగా చూడలేదు భాస్కర్. కారులో వెళ్లి కారులో బురుమంటూ వచ్చి ఇల్లు లాక్ చేసుకుని. టెలివిజన్లముందు కాలక్షేపం చేస్తారు చాలామంది.

భారతీయత ఎంత ఇష్టమైనా— మొదటిసారిగా అమెరికా వచ్చిన భాస్కర్‌బాబుకు అక్కడి వాతావరణంలో కొత్తదనం, నీటుదనం నచ్చాయి.

ఇండియాకు తిరిగి వెళ్లడమంటూ జరిగితే ఇక్కడి కళాకారుల్ని కలుసుకొని, చర్చలు జరిపి వెళ్లాలి. భారత ప్రతిభ గురించి మనగురించి కూడా కాస్త తెలిసేలా చేయాలి అనుకున్నాడు.

ఆరోజు ఫైర్‌ప్లేస్‌లో కుర్చీలో చేరగిలి దినపత్రిక చూస్తున్నాడు భాస్కర్.

బోయ్‌వచ్చి వుత్తరాలిచ్చి వెళ్లిపోయాడు. సుమారుముప్ఫయ్ వుంటాయి. అతని కళ్లు ఆతురతగా వెదికాయి.

ఇన్నాళ్ళుగా ఎదురు చూసిన రెండు వుత్తరాలున్నాయి.

మొదట ప్రవీణ ఉత్తరం తీశాడు.

శ్రీ భాస్కర్ బాబూ నమస్తే !

నేను చేసిన పిచ్చిపనికి మీరింత పెద్ద శిక్ష వేస్తారని అనుకోలేదు. మిమ్మల్ని చూడకుండా మద్రాసు ప్రజలు, మీరు నటించకపోతే తెలుగువారు వూరుకోరు. ముఖ్యం మీలాటి గొప్పనటుడ్ని వాళ్లకు నేను దూరం చేశాననే దిగులుతో నన్ను మంచం పట్టనివ్వకండి. 'మీరు తిరిగి రానని' నాకు తెలియజేసిన రోజు నేను ఏమైనానో ఆ ఘోర వార్త మీరు వింటారు.

వుంటాను
మీ
ప్రవీణ.

'హుఁ! తన గురించి అంత నమ్మకంగా రాస్తోందే?' అనుకున్నాడు భాస్కర్. ప్రవీణ చనిపోతుందంటే తాను పరుగెత్తి మద్రాసు చేరుకుంటాడని అంత నమ్మకమా ?— ఏమిటో ఈ ప్రవీణ చాలా తెలివిగానే తనని

*జరిగిన కథ 6*: ప్రసిద్ధ హీరో భాస్కర్‌బాబుతో తన కథ చెప్పటం మొదలు పెడ్తుంది వర్ధమానతార ప్రవీణ. ముసలివాడితో తన పెళ్లి నిశ్చయమవటంతో మధు అనే కుర్రాడి సాయంతో మద్రాసు బయల్దేరుతుంది రాజ్యం. తనని పెళ్లి చేసుకోమనికోరిన తోటి నటుడు ప్రకాశబాబు కోరికను తిరస్కరిస్తుంది ప్రవీణ. మద్రాసు చేరిన రాజ్యంకి దూరపు బంధువు, సినీనటి అయిన సరయూరాణి ఆదరణ లభిస్తుంది. భాస్కర్ బాబు భార్య శారద. భవిష్యత్తు మీద దిగులుతో కృశించిపోతున్న రాజ్యంని ఓదార్చి తన కథ చెప్తుంది సరయూరాణి. కొద్ది కాలంలోనే సినీరంగంలో పేరు తెచ్చుకున్న రాజ్యమే ప్రవీణ అని తెలుసుకుంటాడు భాస్కర్‌బాబు. భాస్కర్ బాబుకి మరొకరితో సంబంధం వుందన్న పుకార్లకే చలించిపోతుంది శారద. తనను పెళ్లాడమన్న ప్రవీణ కోరికను తిరస్కరిస్తాడు భాస్కర్ బాబు. భాస్కర్ బాబుతో కలిసి నటించనని శారదకి మాటఇస్తుంది ప్రవీణ. తనకు ప్రవీణతో సంబంధం వుందని శారద అనుమానించటంతో అందరికీ దూరంగా అమెరికా వెళ్లిపోతాడు భాస్కర్‌బాబు.

…బరుచుకుంది. కొందరు మంచితనంతో …దైనా సాధిస్తారు! మంచితనాన్ని ప్రేమించే వాళ్ళు దానికే లొంగుతారు.

ఆ తరువాత శారద ఉత్తరం తెరిచాడు. శారద అక్షరాలు ఆమెలాగే బక్కపలచగా వున్నాయి. విషాదం గూడు కట్టుకున్నట్టు తేలిపోతున్నాయి.

భాస్కర్ పెదవుల మీద పేలవమైన చిరునవ్వు వికసించింది.

మ. శ్రీ భర్తగారైన భాస్కర్ బాబుకి!



హృదయపూర్వక వందనములతో వ్రాయునది; నేను మీ పట్ల చేసిన అపచారాలు ఏమున్నాయని అంతదూరం వెళిపోయేరు? తన భర్త తనను ఎప్పటికీ ఒకేలా ప్రేమించాలని ఏ స్త్రీ అనుకోదు చెప్పండి? ఎంతో అనుభవంతో పాత్రపోషణ చేసే మీరు కూడా నన్ను అర్థం చేసుకోలేదు. నాకు ఇక్కడ విసుగుగా వుంది. నేను కూడా మీ వద్దకు అమెరికా వచ్చేసి, ఈ వాతావరణానికి దూరంగా వుంటాను. వెంటనే జాబు రాయండి, చి. బాబు మీ కోసం బెంగ పెట్టుకున్నాడు. మీ సమాధానం రాకపోతే నేనేమైపోతానో నాకంటె మీకే బాగా తెలుసు.

మీ జాబుకి వేయికళ్ళతో ఎదురుచూసే

మీ పాద దాసి

శారద.

'శారదా! శారదా! ఇక్కడికి వస్తాననేది ఈ ధరవరలు చూసి అస్తమానం నామీద విసుక్కోడానికా?' అని నవ్వుకున్నాడు — ఆ రోజే ధరల వివరాలు తెల్సుకొని వచ్చిన భాస్కర్.

ఉత్తరాలు పెట్టేసి నీరెండలో షడి షికారు బయలుదేరాడు. జన సంచారం తక్కువగా వుంది ఆరోజు. ఇండియాలా కాదు. చెత్తదనం తక్కువ, నీటుదనం ఎక్కువగా వుంది. బాడీ వెక్స్ వేసుకున్న ఇద్దరు ఆడవాళ్ళు భాస్కర్‌ని చూసి ఏదో అనుకున్నారు — తమలో నవ్వుకుంటూ వెళ్ళేరు. 'ఇండియన్ ఫిలాసఫర్...' అని రెండు ముక్కలు మాత్రం భాస్కర్ చెవి వరకు వచ్చాయి.

'ఫిలాసఫర్‌నయినా బాగుండేది. ఇండియాకు పోవాలనే కాంక్ష వుండేది కాదేమో' అనుకున్నాడు. అయితే ఇక్కడికివచ్చి స్థిరపడిన వాళ్ళంతా వేదాంతులా? కాదే! బహుశః వాళ్ళు స్వర్గ పేక్షతో తపమాచరించే ఋషులు!

తిరిగి ఇంటికి చేరి భోజన కార్యక్రమం తరువాత అభిమానుల అభిప్రాయాలు చదివాడు. అందరూ తన రాకకు వేయికళ్ళతో ఎదురుచూస్తున్నారు.

అభిమాన సంఘం తనకోసం అమెరికా వచ్చేయడానికి చందాలు పోగుచేస్తున్నట్టు అభిమాని ఒకతను వ్రాసేడు.

* * *

భాస్కర్ నుంచి జవాబు లేదు ప్రవీణ ఔన్యంలోకి మాసూస్తు ర్పుంది. ఆరోగ్యం

బాగులేదని షూటింగుకి వెళ్లడం మానేసింది. శారద పరిస్థితి సరేసరి. అనుక్షణం పోస్టు మాన్ కోసం ఎదురు చూస్తూ కూర్చునేది.

'భాస్కర్ భవన్' అడవిలా తయారైంది. శారద దయ్యం పట్టిన మనిషిలా ఆలోచిస్తూ వుండిపోతూంది.

ఆ రాత్రి శారద దిగులుగా మంచంమీద వాలింది. బాబు కాస్సేపు ఎందుకో ఏడ్చి శారద పక్కలోకి వచ్చి పడుకున్నాడు.

ఎప్పుడు నిద్ర పట్టిందో శారదకు తెలీదు. ఛళ్ళుమని శబ్దమై మెలకువ వచ్చింది. అంతా అంధకారం ఎవరో కిటికీలోంచి దూకిన చప్పుడుకి శారద గుండె ఝల్లుమని కెవ్వున కేక పెట్టింది. వంటమనిషి, నౌకర్లు అంతా పరిగెత్తుకుంటూ వచ్చారు మెయిన్ ఆఫ్‌చేసి లేదు. శారద గదిలో మాత్రమే స్విచ్చి ఆఫ్ చేసేసి వుంది బెడ్‌లైట్ తీసేశారు.

లైటువేసి చూసేసరికి వక్కమీద గుచ్చి వున్న కత్తి కనిపించింది అందరూ భయంతో జలదరించిపోయేరు. "ఎంత ప్రమాదం తప్పిందమ్మా" అని వంటమనిషి శారదను కౌగలించుకుంది.

మరునాడు పోలీసులకి రిపోర్టు చేసింది శారద. తనకు ప్రవీణమీద అనుమానంగా వుందని అనుమాం కారణాలు కూడా వెల్లడించిందామె. ప్రవీణను వెంటనే అరెస్టు చేశారు.

ప్రవీణ తను నిర్దోషి అని నిరూపించుకోవడానికి ప్రయత్నించలేదు భాస్కర్ తనని క్షమించనప్పుడు ఈ శిక్షే హాయి అనుకుందామె మనసు. సరయూరాణి మాత్రం "ఇది అన్యాయం ప్రవీణను విడిచిపెట్టాలి" అని అరిచింది. ఏడ్చి మొత్తుకుంది. ప్రవీణను విడిచిపెట్టడానికి పెద్దమనుషులు చాలామంది వచ్చినా వాళ్ల ప్రయత్నం సాగనివ్వనిది ప్రవీణే

ప్రవీణ జైల్లోంచి సరయుని చూసి ప్రేమతో "ఏడ్వవద్దు" అని సైగచేసింది. "అక్కా! ఇలా నేను అరెస్టు అయినట్టు తెలిస్తే భాస్కర్‌గారు వస్తారు. కాబట్టి కొన్నాళ్ళిందులో వుండదలిచాను." అంది.

సరయూరాణి ఇంటికి వచ్చింది. ఆమె మనస్సు మనస్సులోలేదు తనకి ప్రవీణమీద ఇంత అనురాగం వుందని ఈ క్షణంలోనే తెలిసిందేమో. సావిత్రమ్మకి ఈ సంగతి చెప్తుండగా ఏదో అనుమానం వచ్చింది. భోజనం చేస్తూ సావిత్రమ్మవంక పరిశీలనగా చూడసాగింది సరయూ సావిత్రమ్మ దేనికో తడబడుతున్నట్టు కనబడింది.

"అమ్మా! ప్రవీణ ఈ హత్యా ప్రయత్నం చేసిందంటే నువ్వు నమ్ముతావా ?" అడిగింది సరయూ.

"ఏమో మనకేం తెలుసు ?- శారదంటే ఆవిడకు పడదటకదా — చేసినా చేసి వుండొచ్చు."

"సావిత్రమ్మా !"

ఎప్పుడూ 'అమ్మా' అనిపిలిచే సరయూరాణి అలా గద్దించే సరికి వణికి పోయింది సావిత్రమ్మ.

"ఏమిటి తల్లీ అంత కోపం ?— నేనేం చేశాను మధ్య ?"

"నువ్వే ఏదో చేసివుంటావు ?— మన యింట్లో అంతకాలం వున్న ప్రవీణ హత్యా ప్రయత్నం చేయించగల దగాకోరు కాకపోతే ?

## వాక్శుద్ధి – వాక్సిద్ధి * ధర్మపథం * – బులుసు వేంకటరమణయ్య

వాక్శుద్ధి అంటే పరిశుద్ధమైన వాక్కు కలిగి ఉండడం. ఎల్లప్పుడున్నూ సత్యం పలికేవారికే వాక్సిద్ధి ఉంటుంది. సత్యంపేరెత్తే సరికి మనకు షట్చక్రవర్తులలో మొదటివాడైన హరిశ్చంద్రుడు జ్ఞప్తికి వస్తాడు. తన సూనృతవాక్కును పరిపాలించడంకోసం ఆయన ఎటువంటి కష్టాలు పడినదీ తలచుకొంటే ఒళ్ళు జల్లుమంటుంది. తన సత్యపాలనవల్లనే అతడు మానవులకూ, దేవతలకూ కూడా సాధ్యం కాని పనులను సాధించాడుగదా! దాని మహత్తు అనిర్వచనీయమైనది!

ఉన్నది ఉన్నట్లుగానూ, చూసినది చూచినట్లుగాను, విన్నది ఆ వినినవిధంగానూ చెప్పడమే సత్యం. స్త్రీలను కాపాడవలసినప్పుడు, వివాహాల విషయంలోనూ, ప్రాణాపాయం, మానభంగం కలిగేటప్పుడున్నూ వాటిని తప్పించుకొనడానికి అసత్యం చెప్పినా తప్పు లేదని "వారిజాక్షులందు......బొంకవచ్చు నఘము పొంద దధిప!"అనే ఆప్తవాక్యం చెపుతూ ఉన్నది. కాని అది ఉత్తమపక్షం కాదు.

సరియైన మనుష్యుడు ఏదయినా చెప్పవలసి వచ్చినప్పుడు ముందుగా ఆలోచించుకోవాలి–"నా కోసం గాని యితరుల కోసం గాని, నేను ఎందుకు అబద్ధం ఆడాలి? " అని. అలా ఆలోచిస్తే అబద్ధం చెప్పాలనే బుద్ధి పుట్టదు. ఆలోచన లేనప్పుడే అవకతవక పనులు చెయ్యవలసి వస్తుంది. 'ఎటువంటి పరిస్థితులలో నయినా సరే, అబద్ధం పలుకను' అనే పట్టుదల ఉండాలి. అలాటి నియమం చేసుకోడానికి ఒక పైసాకూడా ఖర్చు కాదు.

పూర్వం మహర్షులు, మహాకవులూ ఎలా చెప్తే అలా జరిగేదంటే దానికి పరిశుద్ధమైన వాక్కే కారణం. మునులు శపించి, తిరిగి దాన్ని మళ్ళించినట్లే మహాకవులు కూడా రాజులను జోగులను చెయ్యడం, ఆ జోగుల్ని అనుగ్రహించి వారి రాజ్యాలు వారి కియ్యడం జరిగేది. అట్టి మహనీయుల పేర్లు చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయాయి.

పరిశుద్ధమైన వాక్కు ఉన్నట్లయితే ఏ మాట చెప్తే ఆ ప్రకారంగా జరుగుతుంది. అందువల్ల మాటలలో పరిశుద్ధత ఉండాలి. వాక్శుద్ధివల్లనే వాక్సిద్ధి ఏర్పడుతుంది. దీనిని అందరూ గమనించవలసి ఉంటుంది.

---

ఆమె అమాయకత్వం తెలీదూ నీకు ?–"

"ఏమో నాకేం తెలుసు?–" బ్రతుకు జీవుడా అని తప్పుకుంది అక్కడి మండి.

సరయూరాణి ప్రవీణ కోసం తల్లడిల్లి పోయింది. ఆమె భర్త అసిస్టెంటు డైరెక్టరు ప్రవీణను కలుసుకొని "ఎవరిమీదైనా మీకు అనుమానంగా వుందా?" అని అడిగారు.

ప్రవీణ కాసేపు మౌనం వహించి అన్నది.

"వుంది. కాని భాస్కర్ నుంచి ఏదైనా జవాబు వస్తేనే నేను చెప్తాను. మీరు భాస్కర్‌గారికి, నేను అరెస్టు అయినట్టు కేబుల్ పంపండి"అని నిశ్చింతగా చెప్పేసింది.

### 19

ప్రవీణ అరెస్టు అయింది.

వార్త అందిన భాస్కర్ అయోమయంలో పడ్డాడు. ప్రవీణ ఢిల్లీలో తనతో మాట్లాడటం అతనికి గుర్తువచ్చింది.

ప్రవీణ తన జీవితంలోకి మొదటే వచ్చి వుంటే ఏ గొడవా లేకపోయేది. తర్వాత ప్రవేశించి ఇన్ని గొడవలకు కారణమైంది.

ప్రవీణ తను వాళ్ళ యింటికి ఆహ్వానించినప్పుడు సున్నితంగా తిరస్కరించివుంటే ఆమెకీ తనకీ ఈ బాధలు తప్పేవి.

నాగరికతకీ అనాగరికతకీ మధ్య ఇరుక్కొన్న భారత సౌరుల జీవితాలు ఇలాగే వుంటాయి మరి!

విట్టూర్పు విడిచేడు.

అమెరికాకు రహస్యంగా బయలుదేరే ముందు బరువులేని సామగ్రి తీసుకొనివెళ్తూ ఏదో వస్తువు చుట్టడానికి కాగితం వెదుకుతుంటే ప్రవీణ శారదకు రాసిన పుత్తరం దొరికింది. ఏమిటది అనుకుంటూ చదివాడు. అంతా అర్థం కాకపోయినా, శారదకూ ప్రవీణకూ జరిగిన సంఘర్షణను కొంతవరకు ఊహించాడు భాస్కర్ ఆ రోజు. ఆ రోజే ప్రవీణను అతను క్షమించేశాడు. కాని ప్రయాణం మాత్రం విరమించుకోలేదు.

ఈ రోజు లెటర్ ప్యాడ్ చేతిలోకి తీసుకున్నాడు, ఇక్కడికి వచ్చిమొదటిసారిగా. తన అభిమానసంఘం కార్యదర్శికి జాబురాస్తూ–

కార్యదర్శిగారికి!...

ప్రవీణ నిర్దోషి! నిస్సంశయంగా నిర్దోషి. వెంటనే ఆమెని విడుదల చేయించి అసలైన నేరస్థుణ్ణి పట్టే ప్రయత్నం చేయండి. నా అభిమాన సంఘానికి అప్పుడే పూర్తివిలువ యివ్వగలను. మీరు నేరస్థుణ్ణి తెలుసుకున్న మరుక్షణం నాకు తెలియ జేయండి.

ఈ దేశంలో ఇంకా అపరిచితుణ్ణే. కళాకారుడిగా వన్ను వెల్లడి చేసుకొన్న తర్వాత అమెరికాలో కొన్ని ప్రాంతాల్లో పర్యటించి ఇండియాకు తిరిగి వస్తాను. తిరిగి యథాప్రకారం మీవాణ్ణే అవుతాను.

మీ
హీరో
భాస్కర్‌బాబు.

ఈ ఉత్తరం సంగతి తెలియగానే సరయూరాణి ప్రవీణను కలుసుకొంది.

"నాకు ప్రకాష్‌బాబు మీద అనుమానంగా వుంది అక్కా! భాస్కర్ గారికీ నాకూ బెదిరింపు లేఖ లెన్నో వచ్చాయి. అందుకు కారణం నేను అతన్ని తిరస్కరించడం. హీరోగావచ్చి, విలన్‌గా కూడా పనికిరాకుండా పోయి, ఇప్పుడు వూరికే రోడ్లు సర్వే చేస్తున్నాట్ట. నిజ జీవితంలో విలన్ అయిపోయిన పూర్ ఫెలో!

"శారదగారిని హత్య చేయడంలో అతని కేమీ లాభం లేదు. మా మధ్య తగవులు తెలిసిన అతను...ఆ నేరం నామీదకు వస్తుందని, రావాలని అనుకున్నాడు. అతను వూహించినట్టే కొంతవరకు జరిగింది... అతను కాదంటావా అక్కా?–"

"అయివుండచ్చేమో–అదేదో ఆ అభిమాన సంఘాలే తేలుస్తాయి. మనం యింటికి పోదాం."

సరయూరాణితో కలిసి ఆరోజుకు ఆమె యింటిలోనే గడిపింది ప్రవీణ. వసుంధర

(36వ పేజీ చూడండి)




"కమల మీతో అసలు ఏం చెప్పలేదా?" మరోసారి వీధి చివరివంకు చూసి, లోపలికి వస్తూ అడిగాడు విశ్వం.

అతను ఆ మాట అడగటం నాలుగోసారి.

గదికి ఓ మూలగా, మంచంమీద పడుకొన్న ముసలాయన 'చెప్పలేదనట్టు' నీరసంగా తల అడ్డంగా వూపాడు.

వంటగది గుమ్మం మొదట్లో కూర్చుని మిరియాల కషాయం నూరుతున్న పార్వతమ్మ మాత్రం మొహాన్ని చాటు చేస్తున్న తలుపు రెక్కను బార్లా తీసి మరోసారి అతనివంక నఖశిఖ పర్యంతం పరీక్షగా చూసింది.

చెరిగిన పెళ్ళిబొట్టు, రేగిన జుట్టు, ఎర్ర జీరలు తేలిన కళ్ళు, ఖరీదైన నలిగిన బట్టలు... నిటారుగా నిలబడి, తన సమాధానం కోసమన్నట్టు తనవేపే ఆతృతగా చూస్తుండటంతో, మొహం చిట్లించింది పార్వతమ్మ.

"ఏనాడు మాత్రం మనసులో మాట

మాతో చెప్పిందని, ఈనాడు మా పెద్దరి కాన్ని నిలబెడుతుంది.'' అంది రుస రుస లాడుతూ.

విశ్వం మళ్లీ ఏదో అడిగే లోపలే ''చిన్న మాట బ్రదర్!'' అంటూ లోపలనుంచి ముప్పైఏళ్ల వ్యక్తి ఇవతలకొచ్చాడు.

''మా కమల వుంది చూసావ్... అది ఈ యింటికి పునాదిలాంటిది. చాకిరీచేసే ఓ యంత్రం. అలాంటి పెన్నిధి, నిద్ర మంచంమీద కనిపించక పోయేసరికి మా అమ్మకి చెడ్డ జెలసీగా వుంది.'' అన్నాడు అతను.

అతను మాట్లాడేతీరునిబట్టి బాగా తాగి వున్నట్టు గ్రహించాడు విశ్వం. అతను విశ్వం పక్కనచెక్క పెట్టె మీదకూర్చుని,జీవితవిలువల గురించి, మధువు తాగటం వలన మనసెంత తేలికగా వుంటుందో, ఎలాంటి సుఖాన్ని పొందవచ్చునో; ఓ అరగంట వరకు విడిచి పెట్టకుండా వుపన్యాసమిచ్చాడు.

విశ్వం ఆ సారా వాసనను భరించలేక పోతున్నాడు.

ముఖ్యంగా ఆ అతివాగుడు. అయిష్టంగా అతని మాటలు వింటున్నాడేగానీ, విశ్వం మనసులో కమల 'ఏమై పోయింది?' అన్న ప్రశ్నతో నిండిపోయింది అతని చూపు వీధి వాకిలిమీదే నిలిచిపోయింది.

''ఇంతకీ నేను చెప్పొచ్చేదేమిటంటే, మా కమలకి కష్టాలతో ఆరంభమైన జన్మ మళ్లీ నా రూపంలో ప్రత్యక్షమై అంతిమయాత్రకి దోహదం చేసిందేమో అని నా అనుమానం. ప్చ్...పిచ్చిది. సుఖపడటం తెలియదు ''

విశ్వం, చివరి మాటలకి వులిక్కిపడి తల తిప్పి చూసాడు. అప్పటికే ఆ వ్యక్తి లేచి నిలబడి వంటగదివేపు అడుగులేస్తున్నాడు.

'నిజంగా కమల ప్రాణాలు తీసుకోవటానికే తెగించిందా?' ఆ వూహే విశ్వం మనసును నిలువునా ఒణికించింది.

'ఛీ. తనెంత తెలివి తక్కువ వాడు. నిన్న ఆ పొద్దు రాగానే వచ్చి వుండాల్సింది. అసలు మొదటినుంచి తన ఈ నిర్లక్ష్యమే తనకి మనశ్శాంతిని లేకుండా చేస్తోంది.

యింత్రకితం వచ్చిన వ్యక్తి పార్వతమ్మతో ఘర్షణ పడుతున్నాడు.ఆవిడఏమిటో యివ్వను పొమ్మని కేకలేస్తోంది. ఐదు నిముషాల్లోనే యివతలకి వచ్చాడు అతను.వూరికినే కాదు. అనుకున్నది. సాధించి మరీ. అతని చేతిలో రెండు రూపాయల కాయితం రెపరెపలాడు తోంది. అతనితో పాటే ఆవిడ తిట్లు, శాపనార్థాలు వినిపిస్తున్నాయి. అయినా అతను పట్టించుకున్నట్లులేదు.

''వస్తా భాయీ!'' విశ్వం వేపు విజయ గర్వంతో చూస్తూ చేయి వూపి బయటకి వెళ్లిపోయాడు.

ఈ వాతావరణం ఆ యింట్లో పరిపాటే అన్నట్టుంది ఆవిడ తిట్లపరంపర వింటుంటే.

ఒక్క క్షణం విశ్వం మనసు ఆ వాతావర ణాన్ని భరించి, మళ్లీ కమల చుట్టూ అల్లుకు పోయింది.

తన ఆశా సౌధాలన్నీ కూలిపోయి, అందిన పెన్నిధి ఏదో చేజారిపోయిన ఆ వేదనతో మూర్తీభవించిన దైన్యంతో చివరిసారిగా కని పించిన కమల రూపం విశ్వం మనసుని రంపపు కోతకి గురిచేస్తోంది.

'భగవాన్' జీవితంలో యిలాంటి క్షణాలు ఎదురవుతాయని ఎన్నడూ అనుకోలేదు. అను కోనివి జరిగిపోవటం నీ లీల కాబోలు. అయితే నీ యీ లీలలో కమల పాత్ర మాత్రం ముగించకు తండ్రి.' అనుకున్నాడు.

అప్రయత్నంగానే అతని కనుకొలుకుల్లో నీళ్లు నిలిచాయి.

ఆలోచనలు అతన్ని గతంలోకి లాక్కెళ్లి నాయి!

* * *

విశ్వం అన్నకి విశాఖ నుంచి ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయింది. కొత్తచోటు కొత్త వాతావరణం వలన, నాలుగు రోజులకే విశ్వా నికి విసుగ్గా అనిపించింది.

విశ్వం తండ్రి చిన్నతనంలోనే పోయాడు. అప్పటి నుంచి అతని బాధ్యత అన్న వదినల మీద పడింది. ఈ క్షణం వరకు అతనికి ఏ లోటు లేకుండానే పెంచుకొచ్చారు వాళ్లు. విశ్వం తల్లి యిటు పెద్ద కొడుకు దగ్గర, అటు పెళ్లయిన కూతురు దగ్గర వుంటూ వచ్చేది. కూతురి అత్తగారు పోయిన దగ్గర నుంచి. నాలుగైదేళ్లుగా హైదరాబాద్‌లోనే వుంటోంది. అప్పుడప్పుడు కొడుకుల్ని చూడ టానికి వస్తూంటుంది.

విశ్వం బి. ఏ. మానేసి రెండేళ్లు అయినా విశాఖలో ఫ్రెండ్స్‌తో సరదాగా ఏదో ఓ ప్రోగామ్ వేసుకుంటూ, కాలాన్ని నిమిషాల్లా గడిపేసేవాడు. పైగా అడగ్గానే లేదనకుండా అన్న వదిన అతనికి కావలసినంత డబ్బు యిచ్చేవారు.

ప్రయాణపు హడావుడి అంతా సర్దు మణిగి, కాస్త వూపిరి పీల్చుకోవటానికి వీలు చిక్కగానే, అన్న వదినలకి చెప్పి మళ్లీ విశాఖ వెళ్లాడు విశ్వం. పదిరోజులు ఫ్రెండ్స్‌తో కులాసాగా గడిపి తిరిగి వచ్చాడు ఏలూరు.

''బాబాయ్! మాకు కొత్త మిషనమ్మాయ్ దొరికిందిగా. మా బట్టలు ఎంత ఫ్యాషన్‌గా అందంగా కుట్టిందనుకున్నావు. మమ్మల్ని ముద్దు పెట్టుకుంటుంది. మేమంటే చాలా యిష్టం ఆవిడకి.''

విశ్వం యింట్లో అడుగు పెట్టగానే, అన్న కొడుకు, కూతురు, అతనికి వుత్సా హంగా అందించిన విషయాలివి.

ఆ సాయంత్రమే ఆ కొత్త మిషనమ్మాయ్ వచ్చింది.

అప్పుడే స్నానంచేసివచ్చిన విశ్వం, వదినతో మాట్లాడుతున్న ఆ అమ్మాయి వంక ఆస క్తిగా చూసాడు.

సుమారు యిరవై సంవత్సరాలు వుంటాయి. అంత అందమైనదికూడా కాదు. కానీ, తీర్చి దిద్దిన కనుముక్కుతో. అమాయకత్వం, నిర్లి ప్తత పెనవేసుకుపోయి చురుగ్గా కదిలే కళ్లతో...ఓ వింత ఆకర్షణ వుందనిపించింది.

విశ్వం ఆసక్తిగా గుచ్చి గుచ్చి చూడటంతో ఆ అమ్మాయి యిబ్బందిగా ఫీలయింది. అది గమనించి విశ్వం లోపలికి వెళ్లిపోయాడు.

ఆ అమ్మాయిపేరు కమల అని. ఆ వీధికి నాలుగు వీధుల అవతల వుంటున్నారని, ఆమెకి మేనత్త తప్ప తల్లి తండ్రి ఎవ్వరు లేరని, కమల మామయ్య పక్షవాతంతో తీసు కుంటున్నాడని, బాధ్యతతో యిల్లు చక్కదిద్ద వలసిన బావ తాగుబోతు అని, కమల మామ య్యకి వచ్చే పెన్షన్ డబ్బు, కమల మిషన్ కుట్టగా వచ్చే ఆదాయమే ఆ యింటికి ఆధా రమని, తను సేకరించిన వివరాలు మరిదికి వినిపించింది వర్ధనమ్మ.

విశ్వానికి ఆ క్షణంలో కమలమీద చెప్పలేని జాలి కలిగింది

కమల నాలుగు రోజులకోసారి అయినా ఆ యింటికి వస్తోంది. వర్ధనమ్మకి బట్టలపిచ్చి ఎక్కువ కంటికి నచ్చిన బట్టలు ఏవీ వొది యదు నెలలో ఏ ఒకటి రెండు సార్లో తనకి, పిల్లలకి బట్టలు తీస్తూనే వుంటుంది.

వర్ధనమ్మ కబురు పెట్టగానే వస్తుంది






## నన్ను నన్నుగా ప్రేమించు

కమల. అవసరం తనది గనక. మిగతావాళ్ళ బట్టలకి ఎలా యిచ్చినా వర్ధనమ్మ నుంచి కుట్టుకూలి మాత్రం ఎక్కువగా వస్తుంది. అదిగాక యిరుగు పొరుగు వాళ్లకి కూడా చెప్పి వాళ్ల బట్టలు యిస్తోంది.

ఒకరోజు కమల కుట్టిన బట్టలు తీసుకు వచ్చింది. అప్పుడు విశ్వం పుస్తకం చదువుతూ యింట్లోనే వున్నాడు. ఆమెను చూస్తూనే పలకరింపుగా నవ్వాడు. బిడియంతో చటుక్కున చూపులు తిప్పుకొంది కమల.

"జయా మీ స్నేహితురాలు వచ్చిందోయ్" అంటూ లోపలికి కేకవేశాడు విశ్వం.

తనుగాక యింకెవరైనా చిన్నపిల్లలు వచ్చేరేమోనని వెనక్కి తిరిగి చూసింది కమల. ఆమె అమాయికత్వానికి నవ్వొచ్చింది విశ్వానికి. ఇంతలో పదేళ్ల పిల్ల "ఎవరు బాబాయ్!" అంటూ బయటకొచ్చింది.

"అదిగో, ఆవిడే. నీ బెస్టు ఫ్రెండ్ అని నాతో చెప్పావుగా!" అన్నాడు.

అప్పటికి అర్థంచేసుకున్న కమల సిగ్గుపడి పోయింది.

"నీ రోజ్ కలర్ ఫ్రాక్ సాయంత్రం యిస్తానమ్మా!" అంటూ తెచ్చిన బట్టలు ఆ పిల్ల చేతిలో పెట్టి గబగబా బయటకి వెళ్లిపోయింది.

మరో రోజు అర్జంటుగా కొత్తగా ఫ్రెండ్ అయిన ఒకతని బర్త్‌డే పార్టీకి బయలు దేరాడు విశ్వం. తీరా తనకి ఎంతో యిష్టమైన షర్టు వేసుకోబోతే, దానికి ఓ చోట చిరుగు కనిపించింది.

ఆ షర్టు అలా చేసుకువచ్చిన లాండ్రీవాళ్ళ మీద కాసేపు విసుక్కున్నాడు. ఆ తర్వాత కుట్టు కనిపించని విధంగా కమల రఫ్ తీస్తుందని వదినచెబితే. ఆమె దగ్గరకి బయలు దేరాడు

విశ్వం యింటోకి అడుగు పెట్టబోయి, బిగ్గరగా వినిపిస్తున్న అరుపులకి ఆగిపోయాడు. లోపల పార్వతమ్మ, ఆవిడగారి సుపుత్రుడు కలిసి ఎందుకో కమలని దుయ్యబడుతున్నారు.

మిషన్ దగ్గర నిలబడి తలవంచుకుని మౌనంగా ఆ తిట్లను భరిస్తున్న కమలను చూడగానే విశ్వానికి జాలేసింది.

"ఎలా తెస్తావో నాకు తెలియదు. వుదయానికల్లా నాకు పది రూపాయలు యివ్వాలి." బెదరిస్తున్నట్టుగా తర్జని




*రమేష్*



చూపించి విశ్వం పక్కలనుంచే విసురుగా బయటకు వెళ్ళిపోయాడు అతను.

ఆ గొడవకు కారణం కొంత అర్ధమయింది విశ్వానికి. యింటి బాధ్యతను వదలుకుని పైగా తాగటానికి కాబోలు డబ్బులు యివ్వమంటున్నాడు. ఛీ...ఛీ...ఆ తల్లీ కొడుకుల్ని దులిపెయ్యాలన్నంతకోపం వచ్చింది.

ఎందుకో ఇటువేపు తిరిగిన కమల విశ్వాన్ని చూసి ముందు బెల్లబోయింది. ఆ వెంటనే కంగారుగా కంట్లో నలక పడిన దానిలాకళ్ళు గట్టిగా వత్తుకుంది. వత్తే కొద్దీ కంట్లో నీళ్ళు. మనసులో బాధ అధికమయ్యాయేగానీ, తగ్గలేదు. అయినా ఆ బాధని అణచుకోవటానికి ప్రయత్నిస్తూ...

"రండి! కూర్చోండి!" అంటూ మూలనున్న చెక్క కుర్చీ తెచ్చి మిషనుకు దగ్గరగా వేసింది.

అంత బాధలో కూడా పెదవులమీద తెచ్చి పెట్టుకున్న చిరునవ్వు మాటల్లో ఉత్సాహం చూస్తుంటే, అమె గుండె నిబ్బరానికి మెచ్చుకోకుండా వుండలేక పోయాడు విశ్వం.

అతనికి కాఫీ యిచ్చేపాటి స్వతంత్రత కూడా తనకి లేనందుకి కమల సిగ్గుతో తల వంచుకుంది. విశ్వం అది గ్రహించాడు. అయినా గ్రహించబట్టే, తను వచ్చిన పని చెప్పాడు.

విశ్వం వదిన చెప్పినట్టు కమల నిజంగా అలాగే కుట్టింది. కాని చిన్న పొరపాటు జరిగిపోయింది. పార్వతమ్మ చిన్న కొడుకు పదిహేనేళ్లవాడు. ఓ పాతగుడ్డ తెచ్చి తనకు అర్జెంటుగా అది రెండు ముక్కలుగా కట్ చేసి యివ్వమని తొందర చేసాడు.

అది కట్ చేసేటప్పుడు, దాని అడుగున వున్న షర్టు కూడా చాలా భాగం కట్ అయిపోయి పనికిరాకుండా పోయింది. జరిగిన పొరపాటు చూస్తూనే కమలకి మతి పోయినట్టయింది.

విశ్వం పరిస్థితి కూడా అలాగే వుంది. కొద్ది నిముషాల క్రితం కమలపట్ల సానుభూతితో నిండిపోయిన అతని మనసు, ఆ క్షణంలో చెప్పలేని చిరాకు కోపంతో నిండిపోయింది. అతని తత్వమే అంత. వచ్చిన కోపాన్ని నిగ్రహించుకోవటం అతనికి చాతకాదు. ఇప్పుడు అంతే అయింది.

"మా వదిన ఎంతో గొప్పగా చెబితే తీసుకొచ్చాను. నీ నిర్లక్ష్యంతో దాన్ని అస్సలు పనికిరాకుండా చేసావు!" అన్నాడు అసహనంగా.

కమల మనసు చివుక్కుమంది. అతను ఆవేశంతో ఏమి టేమిటో అంటూనేవున్నాడు. తప్పు తనది కాబట్టి పెదవి విప్పలేకపోయింది కమల.

"దాని ఖరీదు ఎంతో చెప్పండి!" చివరికెలాగో మెల్లగా అడిగింది.

"అక్కర్లేదు." అంటూ విశ్వం విసురుగా చేయిచాచి మిషన్‌మీద షర్టు అందుకోబోయాడు.

హఠాత్తుగా చేతిమీద వెచ్చగా తగిలేసరికి వులిక్కిపడి తలెత్తి చూసాడు. కమల చెక్కిలి మీదనుంచి కన్నీరు ధారగా జాలువారుతోంది. విశ్వం కోపం మంచులా కరిగిపోయినట్టయింది.

"కమలా!" అన్నాడు కంగారుగా.

కమల గబగబా కన్నీళ్లు తుడుచుకుని, మొహం పక్కకి తిప్పుకొంది.

విశ్వం మనసు బాధతో మెలితిప్పినట్టయింది. తను యింటోకి రాగానే కనిపించిన సంఘటన గుర్తొచ్చి, తన ప్రవర్తనకి సిగ్గుపడ్డాడు.

"ఐయామ్ సారీ కమలా!" అన్నాడు బాధగా.

"ఫర్వాలేదు. తప్పు నాది. తయారైన దాని ఖరీదు చెప్పండి!"

"దానికి ఖరీదు కట్టడం నా కిష్టంలేదు. యిష్టమైన వస్తువు యిక పనికి రాదనుకుంటే ఎవరి మనస్సైనా ఎలా వుంటుంది చెప్పు? నాకు కొంచెం కోపం ఎక్కువ. నిజం. ఒట్టు. ప్లీజ్ నామాటలేవీ మనసులో వుంచుకోకు!" మనస్ఫూర్తిగా అర్ధించాడు విశ్వం.

కమల పెదవి విప్పి ఏదో చెప్పబోయింది మళ్ళీ.

"ప్లీజ్! యిక ఈ విషయం మరిచిపో!" అంటూ హఠాత్తుగా ఆమె చేయి అందుకొని ముద్దుపెట్టి, గబగబా బయటికి వెళ్లిపోయాడు.

ఈ చర్యకి కమల బిత్తరపోయింది. కొద్ది క్షణాల తర్వాత విశ్వం స్పర్శ, అస్పర్శలోని అనుభూతి, మాటల్లోని మార్దవం, కమల మనసుని పులకరింప చేసాయి.

ఈ సంఘటన మానసికంగా ఆ యిద్దర్నీ దగ్గరికి చేర్చింది. ఆ రోజు తర్వాత విశ్వం కమలతో ఎప్పుడూ నిర్లక్ష్యంగా, కోపంగా ప్రవర్తించలేదు. తరచు అతను కమల యింటికి కూడా వచ్చేవాడు షర్టు కుండీ కుట్టమనో, బనీను రఫ్ టియూలనో సాకు పెట్టుకుని వచ్చేవాడు.

అతని అవస్థ, చిలిపితనం చూస్తుంటే కమలకి నవ్వొచ్చేది. ఒక్కోసారి భయంకూడా కలిగేది. ఈ ఆత్మీయత సంబంధం ఏ క్షణంలోనైనా తనకి దూరమైపోతుందేమో

అని. తను లేనిపోని ఆశలు పెంచు పెంచుకుంటుందేమో అని

అయితే కమల భయాలు కొద్ది రోజుల్లోనే నిజమయ్యాయి.

విశ్వానికి పెళ్ళి అని తెలిసినరోజున, కొద్ది క్షణాల కాలం స్తంభించిపోయినట్టే అనిపించింది కమలకి. కమల బాధకి కారణం అతని నుంచి దూరమైపోవటం ఒక్కటే కాదు. తన దురదృష్టం యింకా తనను విడిచిపెట్టనందుకు, తన కష్టాలు కలలో కూడా అంతం కావటానికి భయపడుతున్నందుకు.

విశ్వానికి ఆ సంబంధం మూడేళ్ళుగా అనుకుంటున్నదే. ఆ అమ్మాయి వర్ధనమ్మకు బాబాయి కూతురు. ఒక్కతే పిల్ల. ఆస్తి వున్నవాళ్ళు.

ముందు విశ్వం తనకి వుద్యోగం వచ్చే వరకు పెళ్ళి చేసుకోనని తప్పించుకోబోయాడు. కానీ ఫలితం కనిపించలేదు.

తనకి పెళ్ళి వద్దని అన్నాడేతప్ప, కమలని ప్రేమిస్తున్నానని ధైర్యంగా చెప్పలేకపోయాడు. కారణం తను పరాధీనుడు కనుక. చిన్నతనం నుంచి తను ఆడింది ఆటగా, కన్నబిడ్డకన్నా ఎక్కువగా తనని పెంచారు వాళ్ళు. బాధ్యతని గుర్తించలేని అతని నిర్లక్ష్యం, ఆ పెళ్ళికి తల వంచేలా చేసింది.

కమలని కలుసుకొని పరిస్థితులు వివరించి క్షమాపణలు కోరుకోవాలనుకున్నాడు. కానీ మొహం చెల్లలేదు. అసలు రెండుమూడు సార్లు ఆ యింటికి వచ్చినా కమల అతనికి

# నన్ను నన్నుగా ప్రేమించు

ఆ అవకాశం యివ్వలేదు.

పెళ్ళికి పదిరోజులు ముందుగానే వర్ధనమ్మ తనవి పిల్లలవి బట్టలు యిచ్చింది కమలకి. రెండు రోజులకే అన్నీ కుట్టి తీసుకొచ్చిన కమల చూపు ఒక్క క్షణం విశ్వం చూపుతో కలుసుకుంది.

ఆ చూపులోని భావాలు, వేదన విశ్వం ఎన్నడూ మరిచిపోలేడేమో. బట్టలు యిచ్చి తిరిగి వెళ్ళిపోతున్న కమల్ని చూసి కంగారుగా...

"కమలా! నీతో మాట్లాడాలి!" అన్నాడు.

"వద్దు! మీరు నాకు సంజాయిషీ చెప్పొద్దు!" అంది మామూలుగా.

"అది కాదు కమలా! ఈ పెళ్ళి ..."

"దేవుడు నిర్ణయించింది. నన్నేదో మోసం చేస్తున్నాననే అపోహతో, మరో ఆడపిల్ల మనసు మాత్రం బాధపెట్టకండి!" నిర్లిప్తంగా అనేసి సమాధానానికైనా చూడకుండా వెళ్ళిపోయింది.

మనిషి ఆలోచనలతో ప్రమేయం లేకుండానే కాలం వెనక్కి పరుగులుతీసోంది పెళ్ళి ఒండురోజుల్లోకి వచ్చింది. ఆ మర్నాడు సాయంత్రమే ఆడపెళ్ళివారి యింటికి తరలి వెళ్ళాలి. యిల్లంతా బంధువులతో నిండిపోయింది.

పెళ్ళికి రాలేని ఫ్రండ్స్ దగ్గర నుంచి. రకరకాల గ్రీటింగ్స్, బహుమతులు వస్తున్నాయి.

ఆరోజు పోస్టులో వచ్చిన రిజిష్టర్ అందుకుని సంతకం చేసాడు విశ్వం. ప్యాకెట్ విప్పి చూస్తూనే విస్తుపోయాడు. పాకెట్ సైజ్ కన్నా కాస పెద్ద పుస్తకం. విశ్వాన్ని అమితంగా ఆశ్చర్యపరిచిన సంగతి' మొదటి పేజీలో అందంగా. పొందికగా, సిరాతో రాసిన 'కానుక' అన్న అక్షరాలు. చూడగానే అదొక స్టోరీ అని గ్రహించాడు.

కుతూహలంగా మధ్యపేజీలు తిరగేశాడు. ఓ పేజీ అతని దృష్టి నాకట్టుకుంది. ఆ పేజీ ఆశాంతం చదివేసరికి అతని మొహం, నెత్తురు చుక్క లేనట్టు, తెల్లగా పాలిపోయింది.

అనుమానం, ఆత్రుత అతన్ని క్షణం వూపిరి తీసుకోనివ్వలేదు గబగబా గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుని ఆ పుస్తకం మొత్తం చదివేశాడు. ఆ పుస్తకం పూర్తిఅయ్యేసరికి, అతని మనసంతా మొద్దుబారిపోయి, తెల్ల కాగితంలా తయారయింది.

తల్లి తండ్రిలేని కమల అత్తయ్య ఆధీనంలో ఎన్ని కష్టాలలో పెరిగిందో. అనుక్షణం ఆ ఇంట్లో ఎలాంటి నరకాన్ని అనుభవించిందో, ఎడారిలో ఒయాసిస్సులా, విశ్వం పరిచయం. ఆమె మనసులో ఎలాంటి వుపశమనాన్ని, వుత్తేజాన్ని కలిగించిందో తీరని అఘాతంలా, కొడిగట్టిన దీపంలా దూరమైన అతని ఆత్మీయత ఎంత అశనిపాతాన్ని కలిగించిందో, విపులంగా ప్రతి సంఘటన సంభాషణ దానిలో వివరించి వున్నాయి.

అది చదువుతున్నంతసేపు విశ్వం కళ్ళు వర్షిస్తూనే వున్నాయి. కమలకి తీరని ద్రోహం చేసున్నానేమో అన్న బాధ. అతని శరీరాన్ని అనిర్వచనీయమైన ఆవేదనతో నలిపేసింది.

'బాధ్యత గుర్తించలేని నిర్లక్ష్యం తనని ఈనాడు అస్వతంత్రుణ్ణి చేసింది. ఈ సమస్యని పరిష్కరించుకోవటం ఎలా?...' విశ్వం ఆ రాత్రంతా నిద్రలేకుండా అలా ఆలోచిస్తూనే వున్నాడు.

ఈ రోజుల్లో పీటలమీద పెళ్ళిళ్ళు ఎన్నో తప్పిపోతున్నాయి. ఈ పెళ్ళి తప్పిపోయినా తమ హోదాతో కట్నం కుమ్మరించి వాళ్ళు మరో పెళ్ళికొడుకును కొనగలరు. కానీ.కమలకి ఆ అదృష్టం వుందా?...

అందుకే ఆ మర్నాడు వుదయమే విశ్వం యింట్లో ఎవ్వరికీ, ఏమీ చెప్పకుండా కమల యింటికి వచ్చాడు. అయితే కమల కనిపించ

## ఉపగ్రహం ద్వారా చేపల వేట

వాషింగ్టన్ - లూయిజియానాలో జరిపిన ఒక అసాధారణ ప్రయోగం ద్వారా, జాలరులు, ఇంజనీర్లు, భౌతిక శాస్త్రవేత్తలు, సాగర శాస్త్రజ్ఞులు, జీవ శాస్త్రజ్ఞులు, కంప్యూటర్ నిపుణులతో కూడిన ఒక బృందం కృత్రిమ ఉపగ్రహం సహాయంతో చేపలను కనుగొన్నారు.

ఉపగ్రహం నేరుగా చేపలను "చూడ"లేదు. అయితే నీటి రంగును ఇది కనిపెట్టగలదు. గుంపులు గుంపులుగా తిరిగే చేపలు నీటి ఉపరితలాన్ని చిందర వందర చేస్తుంటాయి. అందువల్ల నీటిరంగు కూడా మారుతుంటుంది. ఈ రంగు మార్పు ద్వారా అక్కడ చేపల గుంపులు ఉన్నట్లు శాస్త్రజ్ఞులు తెలుసుకొంటారు. సాగరాల లోని నీరు ఈ విధంగా రంగులు మారటాన్ని గురించి ఉపగ్రహం శాస్త్రజ్ఞులకు తెలుపుతుంది.

ఉపగ్రహం పంపే ఇలాంటి సమాచారం ఆధారంగా—అన్నిచోట్ల గాకపోయినా—ఎక్కువ చోట్ల చేపల గుంపులు ఉన్నట్లు చేపలు పట్టే నౌకలు కనుగొన్నాయి.

తీరప్రాంతాలలో చేపల వేటకు ఈ పద్ధతిని సమర్థంగా వినియోగించుకోవచ్చు. అమెరికా జాతీయ మెరిటైమ్ ఫిషరీస్ సర్వీస్ ప్రయివేటు కంపెనీలు ఈ పథకంతో సహకరిస్తున్నాయి.

లేదన్న వార్త అతనికి పిడుగుపాటే అయింది.

* * *

ముసలాయన దగ్గుతెర విశ్వాన్ని వాస్తవం లోకి తెచ్చింది.

పార్వతమ్మ కొడుకు ఎప్పుడు వచ్చాడో కూడా విశ్వం గమనించలేదు. మళ్ళీ తాగి వచ్చినట్టున్నాడు, తెగ వాగుతున్నారు.

విశ్వం వచ్చి ఆరుగంటలు అవుతున్నా, కమల ఏమైందన్న విషయం అంతుబట్టటం లేదు. యింట్లో వాళ్ళు పట్టించుకున్నట్టే లేదు. క్షణాలు దొర్లిపోతుంటే, విశ్వం మనసు బాధతో బరువెక్కిపోతోంది.

మరోసారి వీధిలోకి చూడబోయిన విశ్వం స్తంభించిపోయాడు. లోపలికి అడుగు పెట్టబోతున్న కమలకూడా అతన్ని చూసి నివ్వెరపోయింది.

ఆమె పక్కనే పంచెకట్టులో ముప్పై అయిదేళ్ళ వ్యక్తి వున్నాడు. కమలకి చెరో పక్క పది, ఎనిమిదేళ్ళ ఆడపిల్లలు నిలబడి వున్నారు.

విశ్వం చూపు ఆ ఎవ్వరిమీద లేదు. కమల పైట మీదుగా పచ్చని తాడుకి వేలాడుతున్న మంగళసూత్రాన్ని పిచ్చిగా చూస్తున్నాయి.

యివతలకి వచ్చిన తల్లీకొడుకులు కూడా వీళ్ళని చూస్తూనే తెల్లబోయారు.

ఆ వ్యక్తి ఎవరో విశ్వానికి తెలుసు. ఒకే ఒక్కసారి కమల పరిచయం చేసింది, మనసున్న మంచి వ్యక్తిగా.

అతని పేరు పరమేశం. అతనికి భార్య లేదు. చనిపోయి ఐదారేళ్ళు అవుతోంది. కమల వాళ్ళు సంవత్సరం క్రితం వుండి వచ్చిన యింటిపక్కన వుండేవాళ్ళు. తల్లి పోయిన దగ్గరనుంచి ఆ పసిపిల్లలు కమలకి బాగా చేరిక అయ్యారు. పదేళ్ళుగా పక్క వాటాలో వుంటూ, పార్వతమ్మ కమలను పెట్టే బాధలు, కమల సహనం, మంచితనం అర్థంచేసుకున్న వ్యక్తి ఆయన.

కమల వాళ్ళు యిక్కడికి కొచ్చేసినా, ఆయన అప్పుడప్పుడు వచ్చేవాడు. ఈ విషయాలన్నీ కమల వివరించిన పుస్తకంలో ఓ భాగమే.

'అయితే అతన్ని వివాహం చేసుకుంటున్నట్టు ఎందుకు రాయలేదు. తనుకాదన్నాడని పంతానికి ఆ రెండో పెళ్ళి వాణ్ణి చేసుకుందా?'

కానీ అసలు కారణం కమలకీ ముసలాయనకి తెలుసు.

## నన్ను నన్నుగా ప్రేమించు

మనసుని చంపుకుని, బాధ్యతని మరచిపోయి, యిష్టంవచ్చినట్టు హింసించే కొడుకు అమానుషానికి తట్టుకోలేక, ఎనిమిదేళ్ళ సంసార బంధాన్ని తెంపుకుని, ఎవరితోనో లేచిపోయింది కోడలు.

చాకిరీచేసే ఓ యంత్రంలా, యీ యింటికి తరిగని పెన్నిధిలా కనిపిస్తున్న కమలకి, కొడుకుచేత ఉరితాడు బిగించి, శాశ్వతమైన ఆనందాన్ని, సుఖాన్ని పొందాలని ఆశిస్తోంది పార్వతమ్మ. కొడుకుకూడా అంతే

చివరి రక్తపు బొట్టు వరకు కరిగించి తన శ్రమను ధారపోసినా తనకి ఈ ఇంటో మనశ్శాంతి దొరకదు. ఆ కుటుంబం బాగుపడదు. పరమేశం వ్యక్తిగతంగా తనని అభిమానిస్తున్నాడు. భార్య పోయిన తర్వాత కమలని తనయింటి దీపంగా చేసుకోవాలని అతనికి వున్నా, అతని సంస్కారం పెదవి




విప్పనీయలేదు. ఈ విషయాలన్నీ కమలకి తెలుసు.

తను ప్రేమించినవాళ్ళ నుంచి తనకేం దక్కిందని. అందుకే నిన్న పరమేశం దగ్గరికి వెళ్ళి, తన మనసులోని మాట చెప్పింది. ఆయన సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఇంట్లో ఎవ్వరికి చెప్పకుండా వుదయమే అతని దగ్గరికి వెళ్ళింది. అతని ఆఫీస్ కొలీగ్స్ సమక్షంలో, గుడిలో, దైవసాక్షిగా అతని అర్ధాంగి అయి, తిరిగి వచ్చింది.

తను కానుకగా పంపించిన పుస్తకం... తన జీవితం అతనిలో సంచలనం కలిగించిందని, అతను అన్ని బంధాలు తెంచుకుని వచ్చాడని విశ్వం ద్వారా విన్న కమల కొయ్యబారిపోయింది.

"ఎంత పొరపాటు చేసారు!" అంది చివరికెలాగో.

"నేను చేసింది పొరపాటా?" అన్నాడు విశ్వం నిష్ఠూరంగా.

"అవును. నేను ఆ కానుక పంపించింది ఓ స్నేహితురాలిగా. నా కష్టాల్ని, జీవిత సత్యాల్ని అర్థం చేసుకుని, మీ బాధ్యతల్ని గుర్తించి, మనిషిగా పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని పొందాలనిగానీ, యిలా కల్యాణ తిలకం దిద్దుకుని, కాళ్ళ పారాణి అయినా ఆరనిమరో కన్నెపిల్ల జీవితాన్ని కాలదన్ని రమ్మనికాదు!"

"అయితే నామీద నీకున్న ప్రేమ యింతే నన్నమాట!" అపహాస్యంగా అడిగాడు విశ్వం.

అతని ఆవేశానికి కమలకి బాధ కలగలేదు. జాలేసింది.

"అది పిచ్చి ప్రశ్న. 'నువ్వు ఎవర్ని ప్రేమించలేదూ?' అని అడగండి. ఆత్మీయత కోసం అలమటించిపోతూ, అంతరాలు మరిచిపోయి అందర్నీ ప్రేమించాను. కానీ నాకు జాలి,సానుభూతి తప్ప ఎవ్వరి నుంచి నే కోరుకున్నది అందలేదు. "నన్ను నన్నుగా ఎవ్వరూ ప్రేమించలేదు..." దుఃఖంతో చటుక్కున ఆగిపోయింది కమల.

అంతా బొమ్మల్లా చూస్తుండిపోయారు.

"నన్ను నన్నుగా ప్రేమించింది ఈయన ఒక్కరే. బాధ బాధ్యతల మధ్య సంఘర్షణతో నలిగిపోయే నా హృదయాన్ని, క్షమని, వ్యక్తిగతంగా ప్రేమించిన వ్యక్తి ఈయన. నేను సంపాదిస్తున్నంతవరకు అత్తయ్య బావని బాధ్యత తెలుసుకోనివ్వదు. యిన్నాళ్ళు అన్ని విధాలుగా అందర్నీ ప్రేమించి నా మనసు అలసిపోయింది. యిన్నాళ్ళకి. యిన్నేళ్ళకి నా అలసిన మనసుకి ఆలంబన దొరికింది ..." అంది.

కమల గొంతులో నిశ్చింత వ్యక్తమౌతోంది. మొహంలో ఓ విధమైన సంతృప్తి వింతగా ప్రతిఫలిస్తోంది. విశ్వం పిచ్చివాడిలా, బొమ్మలా, చూడటం తప్ప ఏం మాట్లాడలేకపోతున్నాడు.

"మీ పెళ్ళికివచ్చే అవకాశం లేదు నాకు. ఆయనకి ట్రాన్స్‌ఫర్ అయింది. ఈ రాత్రికే నెల్లూరు వెళ్ళిపోతున్నాము. నన్ను క్షమించండి!" అంటూ గబగబా లోపలికి వెళ్ళిపోయింది కమల.

తనకి ఆవేశమేగానీ ఆలోచన లేదు. సరదాలు తప్ప బాధ్యత తెలియదు. నిజంగా ఆమె కష్టాల పరంపర చదివి కదూ తను వచ్చాడు. అంటే... జాలిపడే కదూ ?

'నన్ను నన్నుగా ప్రేమించు' కమల మాట చెవుల్లో హోరుగా వినిపిస్తోంది. 'తనకా అర్హత లేదు' గిరుక్కున వెనక్కి తిరిగి గబగబా బయటకి నడిచాడు విశ్వం.

పరమేశం జాలిగా నిట్టూర్చాడు. ●

అధిక కోకో పోషకత్వం

అధిక కోకో రుచి

క్రొత్త

# బోర్న్‌విటా అధిక కోకో గలది!

బోర్న్‌విటాలో ఎప్పుడూ ఏ ఇతర మాల్టెడ్ ఆరోగ్య పానీయములో కన్నా అధికంగా కోకో ఉన్నది. మరి ఇప్పుడు బోర్న్‌విటాలో అంతకన్నా ఎక్కువ కోకో ఉన్నది. దాని ఇతోధిక పోషకత్వం కోసం—మరియు ఇదివరకు కన్నా మరింత రుచికరంగా ఉండేందుకు.

బోర్న్‌విటాలోని కోకో రక్తవృద్ధినిచ్చు ఐరన్‌తో సమృద్ధమైనది. మరియు దానిలో విటమిన్ బి & డి మరియు కేల్షియం, ఫాస్ఫరస్, సోడియం మరియు పొటాషియం వంటి అమూల్యమైన ఖనిజ లవణాలు కూడా ఉన్నాయి. వీటికి తోడు బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది. వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది.

మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి, రోజుకు రెండుసార్లు. వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది. మీకూ బోర్న్‌విటా అవసరం...వారికి తగ్గట్టుగా ఉండేందుకు!




**75 పైసలు ఆదా చేయండి.**

బోర్న్‌విటా మీకు 75 పైసలు ఆదాచేసే 450 గ్రాముల రీఫిల్ ప్యాక్‌లో కూడా దొరుకుతుంది. ఈ ప్యాక్ తెరవగానే దానిలోని పదార్థాలను వెంటనే మామూలు బోర్న్‌విటా డబ్బాలోనికి పోయండి. దాని తాజాదనాన్ని నిలిపేందుకు.

క్యాడ్‌బరీస్

## బోర్న్‌విటా

**అధిక కోకో, అధిక శక్తి, అధిక రుచి**

OBM 6714 TL

# వారఫలం

## 1-10-1976 శుక్రవారం మొదలు 7-10-1976 గురువారం వరకు

**మేషం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**వృషభం :—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందగలదు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— విలాస వస్తువులు కొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిధునం :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రులకు సహాయంచేస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వృత్తిలో కార్యభారం పెరుగుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**సింహం :—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది. వారం మధ్యలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందగలదు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోను మాట పట్టింపులు తగవు.

**కన్య :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు— సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల :—** స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు యిబ్బంది కలిగిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం :—** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. వ్యాపారంలో పోటీవారిపోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలించగలవు. రావలసిన డబ్బు అందుతుంది. ముమ్ముందు ఉపయోగించగల వ్యక్తులను కలుసుకొంటారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**కుంభం :—** శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**మీనం :—** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వ్యతిరేకమైన వార్తలను వింటారు. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

— మహేష్

## రాలిన ముత్యాలు

……శ్రీ సోమసుందర్……

దీని దుంపతెగ, ఆకాశంచూడు
ఒడినిండా ఒడియాలు మూటకట్టుకుంది
ఐనా కక్కుర్తి తీరక అప్పుడప్పుడు
అప్పడాలు పటపట లాడిస్తుంది.

## అంగారకునిపై యిసుక శిరసు

బొమ్మలోని పై భాగంలో అంగారకునిపై గల గుట్టలు, యిసుకపర్రలు స్పష్టంగా కనపడుతున్నాయి. వాటిని, అంగారకునిపై దిగిన వైకింగ్ ఒకటి అవతరణ నౌక తీసి పంపింది. పై ఫొటోలో స్తంభంలాగ కనపడుతున్నది అవతరణనౌక మీద వాతావరణ పరిశీలనకై ఏర్పాటైన "చువ్వ." ఫొటో క్రింది భాగంలో గల యిసుకపర్రల మీద ఒక మనిషి తల ఆకారం లాంటి దిబ్బ కనబడుతున్నది. ఈ దృశ్యం వైకింగ్–1 పరిభ్రమణ నౌక 1873 కిలోమీటర్ల ఎత్తునుంచి తీసింది. చిన్న తలకాయ ఆకారంలో గల ఆ యిసుకదిబ్బ వెడల్పు 'కిలోమీటరున్నర' వుంటుందని అంచనా. [అమెరికా పంపిన వైకింగ్–2 అవతరణనౌక కూడా యిప్పుడు అంగారకునిపై వున్నది.]



అంగారకునిపై గల ఒక అగ్ని పర్వతాన్ని వైకింగ్ 4 వేల మైళ్ల దూరంనుంచి తీసిన చిత్రం. ఈ పర్వత బిలం వెడల్పు 100 కిలోమీటర్ ఉంటుంది.

సీరియల్

# బాంధవ్యాలు

యార్లగడ్డ సరోజినీదేవి

*(గత సంచిక తరువాయి)*

"శేఖర్!"

శ్రీధర్ పిలుపు విని తొందరగా జీప్ దగ్గర కెళ్ళాడు.

"దేనికీ బాధపడకూడదు శేఖర్! కాలమే అన్నింటినీ పరిష్కరించుతుంది. వీలుంటే మరోసారి రావటానికి ప్రయత్నించుతాను. అతయినా మామయ్య కోసం! నాకున్న పనులన్నీ ఈవేళతో పూర్తయిపోయాయి. వస్తా!" జీప్ గేరు మార్చాడు. వెంటనే స్పీడు అందుకొంది. శ్రీధర్ అంటున్న మాటలు అస్పష్టంగా వినిపించాయి కిటికీదగ్గిర నిలబడిన జానక్కి. ఏమయి వుంటుందా? అన్న ఆత్రుత లేకపోలేదు. అసలు ఆ సాయంత్రంమంచే శేఖర్ ఎంతో దిగులుగా కనిపించాడు జానక్కి. భోజనాల దగ్గరకూడా చాలా ముభావంగా వున్నాడు. ఎప్పటిలా ఉషారు భర్తలో చూడలేకపోయింది. నిట్టూర్చుతూ కుర్చీలో కూర్చున్న భర్తను చూసి దగ్గరకెళ్ళింది

"ఏమిటలా వున్నారు?" బుజంమీద చెయ్యి వేసి వంగుని భర్త కళ్ళల్లోకి చూసింది.

"ఏముంటుంది జానకీ! శ్రీధరం బావ ఫారిన్ ఈ తెల్లవారుకి వెళ్ళిపోతున్నాడు. తిరిగివచ్చే ఉద్దేశ్యంతో మాత్రం వెళ్ళటంలేదు. నాన్నగారి ఆరోగ్యం చూస్తే అంతంత మాత్రంగానే వున్నది. విజయ జీవితం ఏమవుతుందోనని నా భయం!"

"శ్రీధర్ సంగతి తెలుసుకదా? అతన్ని గురించి భయం దేనికి?"

"నీకు తెలియదు జానకీ! మగవాడికి ఆవేశం వచ్చిందంటే దాన్ని ఆపటానికి ఎవరికీ శక్తి వుండదు. ఈసారి ఫారిన్ వెళ్ళితే వంటరిగా మాత్రం వుండ లేదు. ఆ తరువాత ఎంత ఏడ్చినా మొత్తుకున్నా లాభం లేదు!"

శ్రీధర్ మనస్తత్వం "యిది" అని తెలుసు కున్న జానకి ఎంతో బాధపడింది. ఈ సమస్యను ఎంత తొందరగా వీలయితే అంత తొందరగా పరిష్కరింపచెయ్యాలి! తప్పదు! విజయ కోసమయినా చెయ్యాలి! ఆ పరిష్కారం విజయవైపునుంచే రావాలి! విసిగిపోయిన మగవాడు యిష్టంలేని భార్యను బంధించి వుంచలేడు. శ్రీధర్ తీసుకున్న నిర్ణయం అతనికి సంబంధించినంతవరకూ సముచితంగా వున్నా ఈ సంగతి తెలిసినవెంటనే మామగారికి గుండె ఆగి చనిపోవటం మాత్రం ఖాయం. ప్రశాంతిగా ఏ అల్లరి లేకుండా అన్నీ జరిగిపోవాలి! జానకి ఒక నిర్ణయానికి రాగలిగింది ఆలోచించి!...

## 22

విజయ రూంలోకి అడుగు పెడుతూనే తలుపు సందుల్లోనుంచి క్రిందకు జారిన కవరు కనిపించగానే చేతిలో వున్న రికార్డుని తొందరగా డ్రాయర్‌మీద వుంచి కవరు చింపి చదవసాగింది.

"ప్రియమయిన విజయని దీవించి మీ వదిన వ్రాయునది." ఆహా! వదిన రాసిందన్నమాట? యిన్నిరోజులకి తాను గుర్తువచ్చింది కాబోలు! జవాబు ఘాటుగా వ్రాయాలి! అనుకుని తిరిగి చదవసాగింది.

"నువ్వు వెళ్ళిన తరువాత ఉత్తరం వ్రాయా లనుకుంటూనే తీరుబడిలేక వ్రాయలేకపోయాను. మీ నాన్నగారి ఆరోగ్యం ఏమాత్రం బాగుండలేదు. ఆపరేషన్ చేస్తేనేగాని వీలులేదని డాక్టర్లు అభిప్రాయం. కాని ఆపరేషన్ చేస్తే బ్రతకరేమోనని డాక్టర్లు చెప్పారు. ఏది ఏమయినా ఆపరేషన్ మాత్రం జరగాల్సిందే! శ్రీధర్ తిరిగి ఫారిన్ వెళ్ళిపోతున్నాడు. పాస్‌పోర్టు వీసా వచ్చేసినవి. అన్ని బంధాలూ త్రెంచుకున్నట్లుగా నువ్వు ఢిల్లీ ఎలా వెళ్ళావో? ఫారిన్ కూడా అతనా ఉద్దేశ్యంలోనే వెళ్ళిపోతున్నాడు. ఈ సంగతి తెలిస్తే మీ నాన్నగారు బ్రతకరు. అటు కట్టుకున్న భర్తనూ; యిటు కన్నతండ్రినీ దూరం చేసుకోవద్దు విజయా! శ్రీధర్‌మీద కోపం వుంచుకుని నువ్వేమి సాధించ గలవు? అరటిఆకు వెళ్ళి ముల్లుమీద పడ్డా; ముల్లు వెళ్ళి అరటిఆకుమీద పడ్డా నష్టం అరటిఆకుకే నన్న సంగతి నీకూ తెలుసు. పెళ్ళి అనేది రెండు జీవితాలను మూడుముళ్ళతో బందీలను చేస్తుంది. అన్నీ తెలిసినదానివి శ్రీధర్‌ని క్షమించలేవా? ఆడది ఎంత నేర్చినా చివరికి మగవాడి అండదండలు లేకపోతే మనుగడ సాగించటం చాలా కష్టం. కన్నతండ్రినీ కట్టుకున్న భర్తనూ దక్కించుకోవాలంటే వెంటనే బైలుదేరి వచ్చి నీ కాపురం చక్కదిద్దుకో! చేతులు కాలిన తరువాత గుండెలు బాదుకున్నా ప్రయోజనం శూన్యం. నీ క్షేమం కోరే నీకింత విపులంగా రాస్తున్నాను. నీ రాకకొరకు ఎదురుచూస్తూ వుంటాను!

ప్రేమతో నీ వదిన."

ఉత్తరం చదవటం ముగించగానే ఎక్కడలేని నీరసం వచ్చేసింది విజయకి. తండ్రికి సుస్తీయా? శ్రీధర్ ఫారిన్ వెళ్ళిపోతున్నాడా? హే భగవాన్! నన్నెందుకిలా నడిసముద్రములో వుంచావు? యిష్టంలేని భర్తతో కాపురం ఎలా చెయ్యగలను? తండ్రి అనారోగ్యం గురించి అన్నయ్య క్రితం ఉత్తరంలో ఏమీ వ్రాయలేదు. తానంత కానిదయిందా? యింతమంది మనసులను నొప్పించి నేను సాధించుకునేదిమాత్రం ఏమున్నది? అలా మనసుని సరిపెట్టుకుందామనుకున్నా సరిపోవటం లేదు విజయ మనసుకి.

రెండురోజులు ఆలోచించింది. మూడురోజులు ఆలోచించింది. వారంరోజులు ఆలోచించింది. ఎంత తీవ్రంగా ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేకపోతోంది.

"శ్రీధర్‌మీద కోపం వుంచుకుని నువ్వేమి సాధించగలవో చెప్పు?"

"అరటి ఆకు ముల్లుమీద పడ్డా ముల్లు వెళ్ళి అరటిఆకుమీద పడ్డా!"

"రెండు జీవితాలను పెళ్ళి అనే మూడు ముళ్ళతో బందీలను చేస్తుంది!"

"కన్నతండ్రినీ–కట్టుకున్న భర్తనూ దక్కించుకోవాలంటే వెంటనే బైలుదేరి రా!"

జానకి వ్రాసిన ఉత్తరంలో కొన్ని వాక్యాలు విజయ మనసులో నిలచిపోయాయి. జానకే తన ఎదురుగా నిలబడి తనను బుజ్జగించి చెప్తున్నట్లుగా అనుభూతి పొందింది. బాంధవ్యాలనేవి ఎవరికీ తప్పవు. తన నోటినుంచి ఒక్క మాటకోసం బావ ఎంతగా ఎదురుచూసేవాడు? ఏకాంతం లభించితే చాలు! తనకోసం ఆరాటపడేవాడు. అతనిమీద వున్న కసితో దూరంగా వుంచింది ... తనిప్పుడు బాధపడుతోంది అలా చేసినందుకు.

ఆలోచించి ఆలోచించి తల పగిలిపోతుంటే రాక్‌లో వున్న ఆస్ప్రో బిళ్ళలు రెండు తెచ్చుకుని మంచినీళ్ళ త్రాగింది. జానకి నుంచి ఉత్తరం వచ్చినదగ్గిర నుంచీ ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళటంలేదు! గది విడిచి బైటకి రావటంకూడా అరుదే అయింది. తన ఆలోచనలకు ఒక అంతూ దరీ లేనప్పుడు ఉత్తరాన్ని మరోసారి చదువుకునేది. ఎంత చదివినా ఒకే అర్థం స్ఫురించేది – "ఈ బాంధవ్యాలనుంచి మీ యిద్దరూ తప్పించుకోలేరని."

నిజమే! లోకసత్యాన్ని ఎంత క్షుణ్ణంగా వదిన చెప్పింది? చివరిసారిగా ఆ రాత్రంతా నిద్రపోకుండా ఆలోచించింది. తెల్లవారేసరికి ఒక నిశ్చయానికి వచ్చి ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ దగ్గిర కెళ్ళింది విజయ.

*జరిగిన కథ 15 :* శ్రీధర్ మేనమామ గంగాధరం. శేఖర్, విజయలు గంగాధరం బిడ్డలు. శేఖర్ భార్య జానకి. శ్రీధర్ విజయల మనసులు కలుస్తాయి. కట్నంకోసం బయట సంబంధం చూసిన తల్లికి భయపడి విజయను కాదని, కారు ప్రమాదంలో పెళ్ళికూతురు మరణించటంతో శ్రీధర్ ఫారిన్ వెళ్ళిపోతాడు. శ్రీధర్ జ్ఞాపకాల నుంచి తప్పించుకోవటానికి ఎం. ఏ. లో చేరుతుంది విజయ. శ్రీధర్ తల్లి మరణిస్తుంది. విజయ నిచ్చి పెళ్ళి చేస్తానంటే ఫారిన్ నుంచి వస్తానన్న శ్రీధర్ వుత్తరం చూసి విజయ అంగీకారం లేకుండానే పెళ్ళి జరిపిస్తాడు గంగాధరం. పెళ్ళయినా శ్రీధర్‌ని దూరంగా వుంచుతుంది విజయ. ఎట్లాగైనా విజయ శ్రీధర్‌లను కలపాలని ప్రయత్నిస్తుంటుంది జానకి. విజయ ఎమ్. ఎ. పాసవుతుంది. మనశ్శాంతికోసం స్నేహితుడు శర్మ తీసుకున్న కాంట్రాక్టులో పని చేయడానికి వెళ్ళిపోతాడు శ్రీధర్ ఒంటరిగా. అన్నా, వదినలతోపాటు శ్రీధర్ డామ్ కట్టిస్తున్నచోటుకి వస్తుంది విజయ. అక్కడివారి ప్రవర్తన చికాకు కలిగిస్తుంది విజయకి. రిసర్చి పేరున శ్రీధర్‌కి దూరంగా ఢిల్లీ వెళ్ళిపోతుంది విజయ. విజయ ప్రవర్తనకు విసుగెత్తిపోయిన శ్రీధర్ ఫారిన్ వెళ్ళిపోయేందుకు నిశ్చయించుకుంటాడు.

## 23

ప్రతి మనిషి దూరంగా ఆలోచించి భవిష్యత్ నిర్ణయం చేసుకోవాలి! ఆవేశంతో చేసుకునే నిర్ణయం; ఆవేశంతో వేసే ప్రతి అడుగూ పక్కనే పడుతుందిగాని గమ్యం చూపించేది శూన్యం. దేనికయినా పునఃపరిశీలన అవసరం ప్రతి ఒక్కరికీను.

ఇప్పుడు విజయ పరిస్థితీ అలాగే వున్నది. ఎప్పుడు వెళ్ళి శ్రీధర్ చేతిలో వాలుతానా? అవి. మూడురోజులు చేసిన రైలు ప్రయాణంకంటే మరో రెండు గంటల్లో చేరుకోబోయే తన ఇంటికి ఎప్పుడు చేరుతానా? అన్నంత ఆత్రుతగా వున్నది విజయ మనసు. చాలా రాత్రయింది. హఠాత్తుగా నిద్రలోంచి లేచే అమ్మా నాన్నా అన్నయ్యా వదినా తన రాకకు ఆశ్చర్యపడతారు. ఎవరూ లేని సమయం చూసి వదిన తనను ఆటలు పట్టించుతుంది. ఇంకెన్నో అంటుంది. ఇదివరకటిలాగా తనకిక కోపంరాదని తెలుసు. వదినే కనుక యీ ఉత్తరం వ్రాసివుండకపోతే తన భవిష్యత్తు మరోవిధంగా వుండేది. శ్రీధర్ ఏమంటాడు? తానంత తానే వెళ్ళితే చులకనగా మాట్లాడడుకదా? వెనుకటివన్నీ దృష్టిలో పెట్టుకుని దెప్పడుకదా? మనసంతా అలజడిగా వున్నది. గుర్రం గిట్టల చప్పుడు— బండిచక్రాల మోతకంటే విజయ వేదన యిల్లు దగ్గిరపడుతున్నకొలదీ బాధగానే వున్నది. జట్కా ఊరిలోకి వచ్చేసరికి ఊరంతా నిశ్శబ్దంగా వున్నది. పది గంటలయింది. వీధిలో తిరిగే మనిషికూడా కనిపించలేదు. జట్కా గంగాధరంగారింటి ముందు ఆగగానే తొందరగా జట్కా దిగి గుమ్మంలోకి వచ్చిన విజయకి యింటికి వేయబడిన పెద్ద తాళంకప్ప దర్శనమిచ్చింది.

వీళ్ళంతా ఏమయ్యారు? ఆశ్చర్యపోతూ అలాగే నిలబడిపోయింది. ఏమి తోచలేదు! ఎవరిని పిలచి అడుగుదామన్నా వీధిలో ఎవరూ కనిపించలేదు. తలుపులు తట్టినా నిద్రమీద విసుక్కుంటారేగాని తలుపులు తెరవరు. ఇప్పుడేమి చెయ్యాలి?

"అమ్మాయిగారూ! సామాను దించమంటారా?" జట్కా అబ్బి అడిగాడు.

"కొంచెం ఆగు! యీ యింటికి మూడో యిల్లు వున్నది. ఆ యింటిలో ఎవరయినా వున్నారేమో తీసుకురా!" అంది రోడ్డుమీదకి వచ్చి యిల్లు చూపించుతూ; కర్రని జట్కాలో వుంచి విజయ చూపించిన యింటిదగ్గర కెళ్ళి డబడబ బాదాడు. ఆదమర్చిపోయి నిద్రపోతే ఓపట్టాన వినిపించదని.

"ఎవరూ?"

అంటూనే రంగన్న తలుపులు తెరిచాడు. వాకిట్లో నిలబడివున్న అపరిచిత వ్యక్తిని చూసి ఎవరన్నట్లుగా చూస్తూ వుండిపోయాడు.

"పట్నం నుంచి అమ్మగారు వచ్చి ఆ యింటి ముందు దిగారు. తాళం వేసివున్నది. ఇక్కడెవరయినా వుంటే పిలుచుకురమ్మన్నారు!" అంటూ తన జట్కావంక ఆ యింటివంకా చెయ్యిపెట్టి చూపించాడు జట్కావాలా.

జానకమ్మగారయివుంటారనుకుని తొందరగా వీధిలోకి వచ్చి జట్కావాలాకంటే ముందే వెళ్ళాడు.

విజయను చూస్తూనే ఆశ్చర్యపోయాడు రంగన్న. పోయిన ప్రాణం లేచివచ్చినట్లయింది.

"మీరా చిన్నమ్మగారూ!"

"అమ్మా నాన్నగారు లేరా?"

"పెదబాబుగారికి కడుపులో నెప్పి ఎక్కువయింది. అర్జెంటుగా బెంగుళూరు మొన్ననే తీసుకెళ్ళారు!" వినయంగా చెప్పాడు.

"అలాగా! తాళాలేమీ నీ కివ్వలేదుగా!"

"లేదమ్మా! అప్పుడప్పుడు లోటకెళ్ళి చూస్తూ వుండమన్నారు!"

విజయ ఆలోచనలో పడిపోయింది. అది గ్రహించిన రంగన్న అన్నాడు.

"చిన్నమ్మగారూ! మీకు అభ్యంతరం లేకపోతే మన యింటికి వెళ్ళుదాం రా, తల్లీ!" భయం భయంగానే అన్నాడు.

విజయ యింకేమాత్రం ఆలోచించలేకపోయింది.

"జట్కాలో సామాను వున్నది. లోపల పెట్టించి జట్కావాడికి డబ్బులిచ్చి పంపు!" బాగ్‌లోనుంచి అయిదు రూపాయలు యిచ్చి వెనక్కి తిరిగింది. వాకిట్లో అడుగు పెడుతుంటే విజయ కాళ్ళు వణికాయి. మేనత్త తనను కోడలిగా చేసుకునేందుకు అంగీకరించనప్పటినుంచీ విజయ ఆ యింటి గుమ్మం ఎక్కలేదు. నీ యింటికి నువ్వు వెళ్ళిపొమ్మనమని తల్లి ఎన్నోసార్లు నిష్ఠూరంగా అనేదేగాని పంపించి ఎరుగదు వివాహమయిన తరువాత! మనసుతో రాజీపడిన తరువాత యిదే రావటం. మేనత్తగారింటికి ఎప్పుడూ వస్తూ వున్నప్పటికి ఆ రోజే వచ్చినట్టు ఆ పరిసరాలు; ఆ యిల్లు అంతా కొత్తగా వున్నది. సామాను పట్టించుకుని వచ్చిన రంగన్న సూటుకేసులను అరుగుమీద దించి తొందరగా యింటి తలుపులు తెరిచాడు. లాంతర్ వత్తిని పెద్దది చేశాడు.

ఆ గంటక్రితమే కరెంటు ఫెయిల్ అయింది. ఆ లాంతర్ వెలుగులోనే చుట్టూ చూసింది. ఆ యింటిలో ఎలాంటి మార్పులూ రాలేదు. ఎక్కడివి అక్కడే అలాగే వున్నవి. మార్పు వచ్చినదల్లా మనుష్యుల్లోనే! అప్పుడు అత్తయ్య వున్నది. యిప్పుడు లేదు! అనుకుంది. జట్కావాలా వెళ్ళిపోయిన తరువాత వీధి తలుపులు గడియపెట్టి లోపలికి వచ్చాడు.

"స్నానం చెయ్యాలి రంగన్నా!" అంది సూట్‌కేసులోనుంచి బట్టలు తీస్తూ;

"అరగంట ఆగారంటే వేడినీళ్ళు పెడతాను అమ్మగారూ?"

"వద్దులే రంగన్నా!"

"ఎంతసేపమ్మా?... మీరలా కూర్చోండి!"

అంటూనే దొడ్డిలోకి వెళ్ళిపోయాడు. బట్టలవి తీసుకుని కుర్చీలో కూర్చున్నది. నీళ్ళు కాయటంతో పాటు వంటకూడా ముగించి నీళ్ళు దొడ్డిలో పెట్టి విజయకి చెప్పాడు. లాంతరు చేత్తో పట్టుకుని దారి చూపించాడు. బాత్‌రూంని చూస్తూనే ఆశ్చర్యపోయింది. మేనత్త వుండగా తాటిఆకుల దడి వుండేది యింటికి నాలుగు గజాల దూరంలో! వర్షం వస్తే స్నానం చేస్తే వర్షం నీళ్ళతో తల స్నానంకూడా అయిపోయేది. లోపలికి వచ్చేసరికి కాళ్ళకి యిసుక అంటుకుంటే చెంబులో వస్తూ నీళ్ళు తెచ్చుకుని నాపరాయిమీద నిలబడి కాళ్ళు కడుక్కునిగాని లోపలికి రావీలయ్యేది కాదు! అలా మేనత్త చేస్తుంటే చాలాసార్లు చూసింది. ఒక రోజున వుండబట్టలేక మేనత్తతో అంది.

"నాన్నగారింటిలోలాంటి బాత్‌రూం కట్టించుకుంటే ఈ శ్రమ వుండదని!"

"డబ్బు కావద్దంటే?" అనేది కనకదుర్గమ్మ.

"నీ దగ్గిర చాలా వున్నదిగా అత్తయ్యా!



మహా అయితే వెయ్యి రూపాయలు అవుతాయి. ఎందుకిలా శ్రమ పడటం ?''

"దర్జాకబుర్లు మానెయ్యవే కోడలుపిల్లా? వెయ్యి రూపాయలంటే దాని విలువ నీకేం తెలుసే? అన్నీ మీ నాన్న బుద్ధులే! వడ్డీకిస్తే సంవత్సరానికి ఎంత వడ్డీ వస్తుందో తెలుసా? వున్నంతలోనే జరుపుకోవటం అలవర్చుకోవాలి! మీ నాన్నలాగా డబ్బుని మంచినీళ్లలా ఖర్చుపెట్టే ఆలోచనలు వెయ్యవద్దు!'' అంటూ విజయ మరో మాట మాట్లాడే అవకాశం యివ్వలేదు. మేనత్త ఎంత డబ్బుమనిషో అర్థమయింది విజయకి. యిప్పుడలా లేదు. ఆధునిక సౌకర్యాలతో కట్టించిన బాత్‌రూం. యింటికీ బాత్‌రూంకి మధ్య కాళ్ళకి మట్టి అవకుండా ఎత్తుమీద ఆ దారీ నాపరాయితో సిమెంటు వేసివున్నది. యిది బావ పనే! ఫారిన్‌లో వుండి వచ్చినవాడు ఈ సౌకర్యాలు కలిగించటం అవసరం అనుకుంది. స్నానం చేసి బట్టలు వేసుకుని వచ్చేసరికి డైనింగ్ టేబుల్‌మీద వేడి వేడి అన్నం కోడిగుడ్ల ఆమ్లేట్లు వుంచాడు. విజయ భోంచేస్తుంటే రంగన్నకి ఎంతో సంతోషంగా వున్నది. చినబాబు నాడుంటే ఎంత బాగుండేది? యిట్టా వచ్చి అట్టా వెళ్లిపోయాడు. చెయ్యి కడుక్కోగానే తుండు అందించాడు విజయకి. చెయ్యి తుడుచుకుని గదిలోకి వెళ్లింది రంగన్న లాంతరు ముందు చూపించుతుంటే! ఒక్కటే మంచం వున్నది. దోమతెర కొంచెం ఎత్తి ఆ మంచంమీదనే పడుకుంది. ప్రయాణపు బడలికవల్ల; వేడినీళ్ల స్నానంవల్ల; తనింటికి వచ్చినట్లున్న సంతృప్తితో హాయిగా; తేలికగా ఆదమర్చి నిద్రపోగలిగింది.

## 24

తనకి నలుగురు పిల్లలు పుట్టారని; యీ యింటిలోనే తనూ శ్రీధర్ అన్యోన్యంగా వుంటూ పిల్లలతో ఆడుతూ పాడుతూ హాయిగా ఉంటున్నట్టు కలగన్నది. ఉదయం లేస్తూనే కలను గుర్తుచేసుకుని తనలో తనే నవ్వుకుంది విజయ. బ్రష్ పేస్టూ తీసుకుని బాత్‌రూంలోకి వెళ్లేసరికి రెండు బిందెల వేడి వేడి నీళ్లు సిద్ధంచేసివుంచాడు రంగన్న.

కాఫీకప్పుని టేబుల్‌మీద వుంచాడు టిఫిన్‌తో పాటు! అది చూసిన విజయ —

"నాయర్ ఏమయ్యాడు?'' అనడిగింది.

"పనేమీ లేదుగా అమ్మా! అయ్యగారే మానిపించేశారు. అయినా ఎవరున్నారని వండిపెట్టటానికి? చినబాబుగారు చూస్తే అట్టా! మీరు చూస్తే యీ యింటికే రాకపోతున్నారు. నాకెవరూ లేరుగా అమ్మా! యీ యింటిని కనిపెట్టుకుని వుండమని; తింటానికి గింజలు పెదబాబుగారి దగ్గరనుంచి వచ్చే ఏర్పాటుచేశారు. మీరింకా ముందే వచ్చినట్లయితే బాబుగారు దేశాలు వెళ్లే అభిప్రాయాన్ని మార్చుకునివుండేవారేమో?'' బాధగా అన్నాడు.

"నేనూ వచ్చేశానుగా! అన్నట్టు నిన్నొకటి అడగాలి! నువ్వు బావ దగ్గరకు వెళ్లి, నే యిచ్చే ఉత్తరం యిచ్చి వెంటపెట్టుకునిరావాలి! ఇద్దరం ఆ రాత్రికే బెంగుళూరు వెళ్లి నాన్నగారిని చూడాలి! చాలా అర్జంటు!''

# బాంధవ్యాలు

"అర్ధరాత్రికాడ చినబాబుగారు వచ్చారమ్మా యిక్కడికి!''

"ఏమిటీ? శ్రీధర్ బావ యిక్కడికి! యీ యింటికి వచ్చాడా?'' నమ్మలేనట్టుగా అడిగింది.

"అవునమ్మా! పెదబాబుగారికి ఆపరేషనట! చూసేందుకు వెళ్లారు. మీరు మంచి నిద్రలో వున్నారు. లేపవద్దని మరలా యిక్కడికే వస్తానని పెట్టెలు బెడ్డింగు యిక్కడే వుంచేసి వచ్చిన కారులోనే వెళ్లిపోయారు.''

"నాన్నగారికి ఆపరేషనా? నన్నుకూడా తీసుకు వెళ్లకూడదూ?''

"ఈ సమయంలో మీరక్కడికి వెళ్లటం అంత మంచిదికాదని అన్నారు నాతో! అక్కడ పని అవగానే వచ్చేస్తారుగా అమ్మా!''

తండ్రికి ఆపరేషన్ అంటే ఒకపక్క బాధగానూ; వెతకబోయిన తీగ కాళ్లకు చుట్టుకున్నట్టు సంతోషం మరోప్రక్క. మరలా ఇక్కడికే వస్తానని చెప్పి వెళ్లటంలో బావ ఉద్దేశ్యం? తనను తిరిగి వెళ్లవద్దన్న అర్థం అందులో యిమిడివున్నది. నిజంగా బావ తనను క్షమించినట్టే ననుకుంది. మనసంతా సంతృప్తితో నిండిపోయింది. కాఫీ త్రాగటం పూర్తిచేసి గదిలోకి వెళ్లింది. సూట్‌కేసులు బెడ్డింగ్ కొన్ని పుస్తకాలు. షేవింగ్ బాస్కెటులు. వాటినిండా మాసిపోయిన దుస్తులు, టవల్సు వున్నవి. రంగన్న బెడ్డింగు విప్పి అందులో వున్నవన్నీ తీసి అవతల పడవేస్తున్నాడు. పుస్తకాలు తీసి డ్రాయర్‌మీద వుంచుతున్నాడు ఒక్కొక్కటి! వాటిల్లో గ్రీన్‌కలర్ డైరీమీద విజయ చూపులు నిలిచాయి. ఇతరుల డైరీని చదవటం సభ్యతకాదని తెలిసికూడా తీసుకుని పేజీ తిప్పింది. తన చిన్నప్పటి ఫొటోని చూసి ఆశ్చర్యపోయింది. నలిగి కొంచెం కలరుమాసినాకూడా ఆ ఫొటోనే వుంచుకోవటంలో అర్థం ఏమిటా? అని ఆలోచించసాగింది. డైరీ కవరులో తండ్రి చేవ్రాలుతో వున్న కవర్ను చూడగానే తప్పని మనసు మందలించినా తండ్రి బావకి ఏమని వ్రాసివుంటాడా? అన్న ఆతురతతో తొందరగా తీసి చదవసాగింది.

**బాతాఖానీతో పక్కవారిపని పాడుచేయకండి! అదే క్రమశిక్షణ**

చిరంజీవి శ్రీధర్‌ని దీవించి వ్రాయునది.

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. సంగతులు కూలంకషంగా అర్థంచేసుకున్నాను. విజయను ఇచ్చి వివాహం చేస్తానంటేనే తిరిగి వస్తానని; చెయ్యకపోతే అక్కడే వుండిపోతానని వ్రాశావు. నాకెటూ పాలుపోవటంలేదు. విజయకి నీ విషయం గురించి ఎన్నిసార్లు వ్రాసినా ఆ ప్రస్తావనే వుండేదికాదు జవాబులో! శ్రీధర్‌ని తప్ప మరెవరినయినా చేసుకుంటానని నిశ్చయంగా చెప్పింది. బహుశా కారణం అదే అయివుంటుందేమో? నిన్ను వదులుకోవాలని నాకూ లేదు. మనసువిప్పి ప్రతీ విషయం నాకు రాస్తున్నావు. నీ మనసెలాంటిదో నాకు తెలుసు. నీ ఉత్తరంరాగానే విజయకి వ్రాసి తెలుసుకున్నాను. తనకీ యీ వివాహం యిష్టమేనన్నది. విజయ అంగీకరించింది కాబట్టి మీ పెళ్లి నిర్విఘ్నంగా జరిపించే బాధ్యత నాది. అక్కడవన్నీ పూర్తిచేసుకుని బైలుదేరి ఇండియా వచ్చెయ్యి. నీవు ఎప్పుడు వచ్చేదీ రాస్తే లగ్నం పెట్టించి పనులన్నీ చేయించేస్తాను! విజయ బాగానేవున్నది అక్కడ!

ఇట్లు,
మీ మామయ్య.

తండ్రి తన అనుమతి లేకుండా ఎందుకీ వివాహం జరిపించాడో అసత్యమాడి అర్థమయింది. మేనల్లుడు ఫారిన్‌కి అంకితం అవటం యిష్టంలేకనే యిలా చేశారు. తన మేనల్లుడ్ని ఎక్కువనుకోవటంలో తండ్రి ఉద్దేశ్యం ఏమిటో అర్థమయింది. నాన్నగారు అలా వ్రాసేసరికి శ్రీధర్ నమ్మి తనను పెళ్లిచేసుకోవటం; తనకిష్టంలేని వివాహమయిందన్న కోపంతో అనుక్షణం శ్రీధర్‌ని ద్వేషించుతూ తనమీద అతనికి అసహ్యం కలిగేలా ప్రవర్తించింది. ఇందులో శ్రీధర్ దేమీ తప్పులేదు! తప్పంతా తండ్రిది. ఆ తరువాత తనది! ఎంత బాధను కాలకూట విషంలాగా దిగమింగుకున్నావు బావా! అనుకుంది. డైరీని మూసి పుస్తకాలమధ్య పెట్టేసి రంగన్నతోపాటు తనుకూడా సర్దసాగింది. మాసిన బట్టలన్నీ బైట వేశాడు. తలగడలు తీసుకుని ఎండలోపెట్టి వచ్చాడు. ప్రతీ ఒక్కటీ రంగన్నతో దగ్గరవుండి చేయించుతోంది. దోమతెర వున్న మంచం మరీ గోడకి దగ్గరగావుంటే గది మధ్యకి లాగింది. సాయంత్రానికల్లా ఆ యింటిలో చాలా మార్పులు వచ్చేశాయి. ఏనాటిదో మధ్య గదిలో వున్న భోషాణాన్ని చావిట్లోకి చేర్పించింది. చెక్క బీరువాలు వెనుకవైపు గదిలోకి చేర్పించింది. ఉన్న కుర్చీలనే మధ్య గదిలో వేసి డ్రాయింగు రూంగా తయారుచేసింది. విజయ అత్తవారింటికి వచ్చేసిందని సాయంత్రానికంతా ఆ గ్రామమంతా తెలిసిపోయింది అందరికీను!

"ఇప్పటికయినా మంచి పనే జరిగింది ఆ బాబుకి! భార్య రానందుకేగా ఊరు వదిలిపెట్టి వెళ్లిపోయేందుకు అన్నీ సిద్ధం చేసుకున్నాడు?'' అనుకున్నారు శ్రీధర్ సంగతి తెలిసిన గ్రామస్తులు!

## 25

హాస్పటల్ వరండాలో పచార్లు చేస్తున్న శేఖర్ కారు దిగి లోపలికి వస్తున్న శ్రీధర్‌ని చూసేసరికి పోయిన శక్తి అంతా వచ్చినట్లయినది. ఆ రోజే గంగాధరం ఆపరేషన్ అని క్రితం రోజునే చెప్పారు. తండ్రికి ఏమవుతుందోనని బెంగపడిపోయిన శేఖర్‌ని చూస్తూనే పరిస్థితి ఏమిటో అర్థం చేసుకున్నాడు.

"బావా!...'' అంటూనే ఎదురెళ్లి శ్రీధర్‌ని కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు.

"ఛా! ఛా!... ఏమిటిది? మామయ్యకేమీ కాదు! నాకు మాత్రం లేదా బాధ? ఈ సమయంలోనే ధైర్యం వహించాలి!'' భుజం తట్టుతూ అన్నాడు శ్రీధర్.

"ఈ సంగతి నీకెలా తెలిసింది బావా?...''

"శర్మ పనుండి బెంగుళూరు వచ్చాడు. మీరు ట్రైన్ దిగి టాక్సీ ఎక్కుతుంటే తను చూశాడట!

కారణం ఏమిటో తెలుసుకోవాలని వచ్చేసరికి మీ టాక్సీ వెళ్ళిపోయిందని చెప్పాడు. కారణం యిదే అయివుంటుందని వూహించినా అసలు సంగతి రంగన్నకు తెలుస్తుందని యింటికి వచ్చాను. రంగన్న చెప్పగా సామాను యింట్లో వేసి యిలా వచ్చేశాను వెంటనే! సమయానికే వచ్చాను."

"తప్పని పరిస్థితిలో ఆపరేషన్ చెయ్యాల్సి వచ్చింది. నీకు వ్రాసినా ఉత్తరం అందదు. అదీగక చాలా కోపంగా వున్నావు అందరిమీదాను!"

"ఇప్పుడిక ఎవరిమీదా కోపంలేదు శేఖర్! అన్నీ సవ్యంగానే జరిగినవి యిప్పటివరకూను! యింకా అలాగే అన్నీ మనకు అనుకూలంగానే జరుగుతాయని నా అభిప్రాయం. కోపం వుంటే యిలా పరిగెత్తుకు వచ్చేవాడినేకాదుగా! నూరు మైళ్ళ స్పీడులో వచ్చాను తెలుసా?..."

"నా బావ సంగతి నాకు తెలియదా?" గర్వంగా శ్రీధర్‌వంక చూశాడు.

"పొగడ్తలు తరువాత! మామయ్యను చూడ వచ్చునా?"

"ఆపరేషన్‌కి సిద్ధం చేస్తున్నారు. అన్నీ అయిన తరువాత నర్సు పిలుస్తుంది. అప్పుడు మనం వెళ్ళవచ్చు! ఈలోగా ముఖం కడుక్కుని కాఫీ త్రాగి ఆ మురికిబట్టలు మార్చుకుని రా! యింటి అడ్రసు యిస్తాను!"

"మామయ్యను చూసేవరకూ పచ్చి మంచినీళ్ళ కూడా ముట్టను శేఖర్!"

శ్రీధర్ గంభీర స్వరానికి విస్తుపోయాడు. యిద్దరూ మౌనం వహించారు. వచ్చే పోయే జనం వంక చూస్తున్నారు. పోర్టికోలో వచ్చే కారు పోయే కారుతో ఖాళీ లేదు. యింతలో నర్సు బైటికి వచ్చి అన్నది.

"యస్! కమిన్! డోంట్ డిస్టర్బ్!"

మరో రూంలోకి వెళ్ళిపోయింది. శేఖర్ శ్రీధర్ గదిలోకి ప్రవేశించారు. బెడ్‌మీద నీరసంగా పడుకుని వున్న గంగాధరం అడుగుల చప్పుడు విని కళ్ళు విప్పి మాసి ఆశ్చర్యపోయాడు శ్రీధర్‌ని చూస్తూనే? తలంతా రేగిపోయినది. బట్టలు రబ్బీను కొట్టుకుని రంగు మారాయి. నిద్రలేమివల్ల కళ్ళు ఎర్రవారి ఉబ్బినట్లున్నవి. శ్రీధర్‌ని ఆ స్థితిలో చూసిన గంగాధరానికి ఏమీ అర్థం కాలేదు! బహుశా శేఖర్ జాబు వ్రాసివుంటాడు. అందుగానే పరిగెత్తుకు వచ్చినట్లున్నది అతని వాలకం. శ్రీధర్ ఫారిన్ వెళ్ళే సన్నాహంలో వున్నాడని విన్న ఆయన మనసు విపరీతంగా బాధపడింది. విజయను చేస్తానంటేనే ఇండియాకు వస్తానని; లేకపోతే ఫారిన్‌లోనే వుంటానని వ్రాసిన మేనల్లుడుకి తను తప్పితే యింకెవ మున్నారని విజయ మనసుకి విరుద్ధంగా ఈ వివాహం జరిపించాడు. ఆ కృతజ్ఞతయినా లేకుండా మేనల్లుడు తనమీద విజయమీద అలిగి వెళ్ళిపోతున్నాడన్ననుంచీ విపరీతమయిన అలజడి కలిగింది. అది తట్టుకోలేక వేళకి నిద్రలేక సరయిన పత్యం చెయ్యనందున మరింత నెప్పి ఎక్కువయి భరించలేనంతగా పరిణమించటంతో హాస్పటల్‌కి రాకతప్పలేదు!

"ఎలా వున్నది మామయ్యా!" దగ్గరకెళ్ళి అడిగాడు శ్రీధర్.

"ఫరవాలేదులే! ఎక్కడనుంచి రావటం?"

శ్రీధర్ జవాబు చెప్పతుండగా శేఖర్ బైటికి వెళ్ళిపోయాడు.

"నీ ఫారిన్ ప్రయాణం ఎప్పుడు?" అడగ కూడదనుకుంటూనే అడిగాడు గంగాధరం.

"... ... ..."

"నువ్వీ నిర్ణయం ఎందుకు చేసుకున్నావో? అసలెందుకు చేసుకోవలసివచ్చిందో నాకు అర్థమయింది. విజయ తప్పు చేస్తే మందలించి యిది సరయినది కాదు! అని నీవు సరిదిద్దుకోగల శక్తి వుందనుకున్నానుగాని; అవివేకంతో నువ్వీ నిర్ణయం తీసుకుంటావని కలలోకూడా అనుకోలేదు. నేను ఈ ఆపరేషన్ నుంచి బ్రతికి బయట పడతానను కోవటంలేదు. విజయని ఏం చేయదల్చుకున్నావో నిర్ణయించి మరీ వెళ్ళు!" ఆయాసంలో ఆగాడు గంగాధరం.

"మేమ్ ఫారిన్ వెళ్ళేందుకు మొదట అనుకున్నది నిజమే మామయ్యా! కాని ఆ అభిప్రాయాన్ని మార్చుకున్నాను. యింకెప్పటికీ వెళ్ళను. వెళ్ళను మామయ్యా! విజయను అన్యాయం చెయ్యాలన్న ఉద్దేశ్యంతో వెళ్ళాలని నిర్ణయించుకోలేదు. విజయ నిన్న రాత్రే వచ్చింది నా యింటికి!"

## ఆణిముత్యం

**- డా॥ సి. నారాయణరెడ్డి**

పశువులు కాదు -
పరమ హంసలే ఎగిసేది
ఇక్కడ

అసురులు కాదు
అమృతాశులే మిగిలేది
ఇక్కడ

రక్తి ముదిరితే రజస్సత్వం
శుక్తి పిదిలితే ఆణిముత్యం

"నిజమా?... నిజమా శ్రీధర్?... విజయ నీ యింటికి వచ్చిందా? వస్తే యిక్కడికి ఎందుకు తీసుకురాలేదు?" సంతోషాశ్చర్యాలతో ప్రశ్నలవర్షం కురిపించాడు.

"ఢిల్లీనుంచి ప్రయాణం అంటే మాటలా మామయ్యా? బాగా అలసిపోయి మంచి నిద్రలో వున్నది. మీ సంగతి చెప్పితే కంగారు పడి తట్టుకోలేదని! తనిక రిసర్చీ చెయ్యదనుకుంటాను! యావత్తు సరంజామాతో వచ్చేసింది!"

యింటివద్ద విజయ వున్నదన్న సంగతి శ్రీధర్ చెప్పతుంటే శేఖర్ విని ఎంతగానో సంతోషించాడు. అప్పుడే వచ్చిన తల్లికి జానక్కి అతినెమ్మదిగా ఈ విషయం చెప్పాడు. శాంతమ్మ సంతోషంగా చేతులు జోడించింది మనసులో దేవుడిని ప్రార్థించుకుంటూ; తన ఉత్తరానికి విలువనిచ్చి మనసు మార్చుకుని వచ్చిన విజయ విశాలత్వాన్ని మనసులోనే మెచ్చుకుంది జానకి.

"మీకు ఆపరేషన్ అయిన తరువాత యింటికి వెళ్ళి విజయను తీసుకొస్తాను మామయ్యా! మీరేమీ బాధపడకండి ఆపరేషన్ గురించి! గుండెలు తీసి గుండెలు పెట్టుతున్న డాక్టర్లు వున్న దేశం మనది. ఆపరేషన్ సక్సెస్ అవుతుంది. మీరింకా మారేళ్ళు బ్రతుకుతారు!" ఉత్సాహంగా అన్నాడు శ్రీధర్.

"నేనింక చావను శ్రీధర్! వెయ్యి ఏనుగుల బలం వచ్చింది నాకు! యింతకు ముందు విజయను గురించి నీ గురించి బాధపడని క్షణం లేదు! విజయ వచ్చి నీ యింటిలోనే వున్నదన్న సంగతి తెలిశాక యింక నాకే దిగులూ లేదు. ఇలాంటి శుభవార్తకోసం యింతకాలంగా ఎదురుచూశాను! విజయ చాలా సెన్సిటివ్! నువ్వెలా చూసుకుంటావో! ఏ చిన్న విషయానికీ విజయ మనసు సంతోషపడేలా ప్రవర్తించగలవని; యిక నేను నిశ్చింతగా ప్రాణాలు విడిచినా కొండంత సంతృప్తితోనే విడుస్తాను! యింక నాకే బాధలూ లేవు."

రుద్ధకంఠంతో అంటున్న గంగాధరం చేతులను తన చేతుల్లోకి తీసుకుని కళ్ళకి అద్దుకున్నాడు వినమ్రంగా; అభిమానంగా!

"విజయ గురించి కాక మీ గురించే ఎక్కువగా బాధపడేవాడిని మామయ్యా! నాకోసం మీరింత త్యాగం చేసినందుకు మీకోసం నేనేమీ చెయ్యలేకపోయానని! మీ మనసు నొప్పించకుండా వుండాలనే మా యిద్దరిమధ్యా ఏర్పడిన అగాధాన్ని ఎవరికీ చెప్పలేదు!"

గంగాధరం జవాబు చెప్పాలనుకుంటుండగా నర్సు; ఆ వెనుక స్ట్రెచర్ తోసుకుంటూ యిద్దరు మేల్సు రూంలోకి రావటంతో మౌనం వహించాడు. శ్రీధర్ పక్కకి తప్పుకుని నిలబడ్డాడు. నర్సు గంగాధరం చేతికి యింజక్షన్ యిచ్చింది. ఆవెంటనే స్ట్రెచర్‌మీద పడుకోబెట్టి తెల్లని దుప్పటి కప్పారు.

"శ్రీధర్!" ఆర్తంగా ఆప్యాయంగా చేతులు జాపాడు గంగాధరం.

"మామయ్యా!" ఆ చేతుల్లో తన ముఖం దాచుకున్నాడు.

స్ట్రెచర్ వెళ్ళిపోయింది. ఆ రూంలో ఒంటరిగా శ్రీధర్ మిగిలాడు. కర్చీఫ్‌తో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ బైటికి వచ్చాడు. శేఖర్ పరిస్థితికూడా యించుమించు అలాగే వున్నది. శాంతమ్మ, జానకిల సంగతి చెప్పనే అక్కరలేదు.

శేఖర్ తనను తాను సమాధానపర్చుకుని శ్రీధర్ దగ్గరకొచ్చి అన్నాడు-

"జానకితో నువు ఫ్లాట్‌కి వెళ్ళి స్నానంచేసి కాఫీ తీసుకురా బావా!"

"నాకిప్పుడేమీ వద్దు శేఖర్! మామయ్య థియేటర్‌లో నుంచి వచ్చి మార్ఫియానుంచి బైట పడేవరకూ నేనేమీ తీసుకోను!"

"నీకేనా బాధ వున్నది? మాకు లేదనుకున్నావా? ఆపరేషన్ సక్సెస్ అవుతుంది. దేనికయినా ఓర్పు అవసరం. పద! పద!"

అంటూ బలవంతంగా నాలుగు అడుగులు లాక్కువచ్చాడు. తప్పేదన్నట్లుగా వెళ్ళి కారులో కూర్చున్నాడు. వెనుక సీటులో జానకి కూర్చున్నది. శేఖర్ చెప్పిన అడ్రసు ప్రకారం కారుని డ్రైవ్ చేయసాగాడు అయిష్టంగానే!

## 26

శ్రీధర్ యింటికి చేరేసరికి రాత్రి పదకొండు గంటలయింది. తలుపు తట్టగానే రంగన్న వచ్చి

తలుపులు తెరిచాడు నిద్ర కళ్లతోనే! వీధంతా నిర్మానుష్యంగా వుంది. డిక్కీలో వున్న సామాను తీయించే ఓపిక లేక సరాసరి లోపలికి వచ్చాడు. వీధి తలుపు గెడపెట్టి వచ్చాడు రంగన్న.

"నేను స్నానంచెయ్యాలి రంగన్నా!"

"అలాగే బాబూ! పెదబాబుగారికి ఎలా వున్నది?"

"ఆపరేషన్ అయిన తరువాత బాగానేవున్నారు. మామయ్య లేచి తిరగటానికి నెల రోజులు పడుతుంది!"

"నెల కాకపోతే రెండు నెలలు అయినా పరవాలేదు బాబూ! ఆరోగ్యం చిక్కింది! అదే చాలు! మీరింకా రాలేదని చిన్నమ్మా నేనూ రెండు రోజుల నుంచీ ఎదురుచూస్తున్నాం."

"మామయ్యకోసమే వుండవలసివచ్చింది. అన్నట్టు యీ నాలుగురోజులూ విజయకెలా కాలం నడిచింది?"

"ఉదయమంతా యిల్లు సర్దుకోవటం; సాయంత్రాలు తోటలోకి వెళ్లటం. మీరు వస్తారేమోనని ఎనిమిదింటివరకూ చూడటం!"

"సరే!" అంటూ టవల్సు తీసుకుని బాత్ రూంలోకి వెళ్లాడు. అయిదువందల మైళ్ల ప్రయాణంతో అలసిపోయివున్న శ్రీధర్ షాంపూతో తలస్నానం చేసేసరికి బడలిక తీరినట్లయింది. రంగన్న వంట ఏర్పాటులు చేస్తుంటే దారిలోనే భోంచేసి వచ్చానని చెప్పి బట్టలవీ కట్టుకున్నాడు.

"పెద్దింటి కెళ్లి కొట్ల అరుగులమీద పడుకుంటాను బాబూ! శేఖరంబాబు పదిసార్లు చెప్పారు! వీధి తలుపులు వేసుకోండి!"

అంటూ కంబలి, దుప్పటి తీసుకుని నెమ్మదిగా బైటకి జారుకున్నాడు.

శ్రీధర్‌కి నవ్వు వచ్చింది రంగన్న ప్రవర్తనకి! మంచినీళ్లు త్రాగి లాబీ లైటు పెట్టుకుంటూ వీధి తలుపులు వేసి లోపలికి వచ్చాడు. చేర్లవేసివున్న గది తలుపులను నెట్టి నెమ్మదిగా లోపలికి వెళ్లాడు. విజయ ఆదమర్చి నిద్రపోయింది. మెలుకువ రావాలని స్విచ్ వేశాడు ట్యూబ్ లైటుకి! ఒక్కసారే గదంతా వెలుగుతో నిండిపోయింది. కళ్లు చికిలించి దోమతెరలో నుంచే చూసింది శ్రీధర్‌ని ఆశ్చర్యంగా! ఆపైన సిగ్గుతో ముడుచుకుంది. తన గదిలో తన మంచంమీద పడుకునివున్న విజయను చూసి అదొక సాధారణ విషయంగానే వున్నది శ్రీధర్‌కి. ఎలా మాట్లాడించాలో అర్థంకాలేదు. ఇదివరకు విజయ

## బాంధవ్యాలు

కోపం అతని మనసు అలమటించిపోయేది. ఇప్పుడు శ్రీధర్‌కోసం విజయ మనసు ఆరాటపడుతోంది. ట్యూబ్ లైటు తీసేసివచ్చి విజయ పక్కనే కూర్చుని నెమ్మదిగా ఆమెమీదకి వంగుని ముఖంలోకి చూశాడు. విజయ కళ్లు విప్పారించి చూస్తున్నది. ఆ కళ్ళల్లో ఎన్నో ప్రశ్నలు; ఎన్నో అనుమానాలు ప్రస్ఫుటించుతున్నాయి. కోపంగామా వున్నాయి.

"విజయా!" అన్నాడు ఎంతో అనురాగంగా!

ఆ పిలుపుకోసమే తన ప్రాణం వున్నట్లు రెండు చేతులూ చాపి అతని వీపుని చుట్టేసి మరింత దగ్గిరగా లాక్కుని నుదురు ముద్దుపెట్టుకుంది. షాంపూ వాసన తేలికగా ఆమె ముక్కు పుటాల్లోకి జొరపడింది. ఆ చేతుల్లో అంత మనిషి కరిగి నీరయిపోయాడు. ఆత్రంగా ఆప్యాయంగా ఆమెను ఆక్రమించుకున్నాడు. విజయ మౌనం వహించింది.

"నామీద కోపమా?" ఆమె ముఖాన్ని తన ముఖంతో కప్పివేస్తూ అడిగాడు.

"కాదామరి? అర్ధరాత్రి వచ్చి అర్ధరాత్రే పారిపోయిన దొంగవు!"

"రాణీగారికి నామీద నిజంగానే దయ కలిగిం దని అప్పుడే తెలిసివున్నట్లయితేనా యిక్కడనుంచి కదలివుండేవాడిని కాదు!"

"నాన్నగారికి ఎలా వున్నది? ఆపరేషన్ సక్సెస్ అయిందా?"

"అన్నీ సవ్యంగా జరిగాయి. భగవంతుని దయ వల్ల మామయ్య సంపూర్ణారోగ్యవంతు లవబోతున్నారు. నిన్ను తీసుకెళ్లేందుకే వచ్చానిప్పుడు?"

"అంటే? నేను వచ్చినట్టు నాన్నగారికి చెప్పావా?"

"ఒక్క నాన్నగారి కేమిటి? అందరికీ చెప్పాను గాని యింత కాలంనుంచీ నాకెందుకలా దూరంగా వున్నావు విజయా? యిప్పటికయినా నన్ను క్షమించానంటేనేగాని!" విజయ చేతులుని తన బుజంమీద నుంచి తీసివేస్తూ అన్నాడు.

"అలాగా పాపం!" అంటూ కిలకిలా నవ్వింది. నవ్వుతునే శ్రీధర్ తలని రేపుతూనే అతని పెదాల మీద గట్టిగా ముద్దు పెట్టుకున్నది. యింకొక్క క్షణం నిలువలేనట్టు తొందరగా విజయను తన హృదయానికి హత్తుకున్నాడు శ్రీధర్. అభ్యంతర పెట్టలేదు విజయ. అతన్ని కరుచుకుపోయింది. ఆమెలోని స్త్రీ పూర్తిగా మేలుకున్నది. తనకంటూ ప్రత్యేకంగా ఏమీ మిగుల్చుకోకుండా భర్తకు అర్పించి తృప్తి పడుతోంది.

పూర్తిగా మెలుకువ వచ్చిన విజయ కళ్ళు విప్పి పక్కకి తిరగబోయింది. శ్రీధర్ చెయ్యి విజయను గట్టిగా వాటేసుకుని వుంటంతో విజయ కదిలేసరికి మెలుకువ వచ్చింది. అయినా కళ్ళు విప్పకుండానే విజయను ఒక్క వుదుటున తనమీదకి లాక్కున్నాడు. ఆప్యాయంగా గుబురుగా వున్న జుట్టులోకి వేళ్లు పోనిచ్చి దువ్వుతూ సుతారంగా చెంపలమీద పెదాలను ఆనించింది. గరికలా మొలుస్తున్న గెడ్డం గిలిగింతలు పెట్టినట్లయినంత అనుభూతి పొందింది. దృఢంగా బలంగా వున్న ఆ చేతులు ఎంత సున్నితంగా స్పృశించుతాయి? ఆ చేతులు తన నెప్పుడూ యిలాగే పొదివిపట్టుకుంటాయి. తన నడుంమీద వున్న చేతిని పట్టుకుని చెంపకు ఆన్చుకుని తల తిప్పుకుంది.

"అదేం కుదరదు అమ్మాయి!" కళ్ళు విప్పకుండానే అన్నాడు శ్రీధర్.

"ఛీ! ఫో! పాచిమొహం నువ్వూను!" ముద్దుగా అల్లరిగా విదిలించింది.

"అందులో వున్న మజా నీకేమి తెలుస్తుంది విజయా! గారాల పట్టీ!"

"ష్! ఏమిటా అల్లరిమాటలు?" తన పెదాలతో అతని పెదాలు మూసేసింది. జీవితం అంటే ఏమిటో తెలుసుకున్న విజయ అతనిలో సంపూర్ణంగా లీనమయిపోయింది.

ఆ జంటను చూసి అరుంధతీ నక్షత్రం మనసారా దీవించి చూపులను చాటు చేసుకున్నది.

[అయిపోయింది] ★

---

**అంకితం**

"సృష్టిలో స్నేహమే తియ్యనిది" అన్నా నానుడిని స్నేహితునిగా అన్ని విషయాల్లో నిరూపించి సోదర బాంధవ్యంతో అత్యంత ఆత్మీయతతో నా శ్రేయస్సే తన శ్రేయస్సుగా భావించి నాకొక వెలుగుబాట చూపించి తాను చీకటి తెరలలోకి శాశ్వతంగా నిష్క్రమించిన సహృదయ సోదరుడు కీ శే. దాట్ల సూర్య నారాయణరాజుగార్కి (రాజబాబు)

అశ్రుతర్పణాలో సోదరి,

**సరోజినిదేవి.**

విమల్
సహజమైన మీ
దేహ సౌందర్యానికి
మరికొంచెం
ఆకర్షణ.

మరెంతో
అందాన్ని
ఇచ్చేది.

VIMAL
A RELIANCE PRODUCT
సూటింగ్స్ • షర్టింగ్స్.

SIMOES/RTI/SS/1B



# * సినిమావిశేషాలు *

## మూడు మాసాల షూటింగు

పి. ఏ. పి. వారి చిత్రం డిశంబరు 15 కల్లా పూర్తవుతుంది. తమిళ రచయిత బాలమురుగన్ రాసిన కథకు, ఆచార్య ఆత్రేయ మాటలను... పాటలను రాసే భారాన్ని మోస్తున్నారు. సంగీతానికి చలపతిరావు, ఛాయకు సెల్వరాజ్, కళకు జి. వి. సుబ్బారావు సారథులు.

వర్స్ వున్న యువ దర్శకుడు తాతినేని రామారావు పి. ఏ. పి. కి పర్మనెంటు ప్రముఖుడు.

## అక్కినేని... తాతినేని కలిసిన మరో చిత్రం

అగ్రనటుడు నాగేశ్వరరావుగారు కథానాయకుడుగా, వర్సీ దర్శకుడు తాతినేని రామారావు నిర్దేశకుడుగా కలిసి పనిచేసే చిత్రాన్ని "జైహింద్" ఎమ్. సత్యం నిర్మిస్తున్నారు.

## అజయ్ ఆర్ట్స్

"జైహింద్" సత్యంగారంటే తెలియని వారుండరు. ఎన్నెన్నో మంచి పనులను, (పెద్దలు చెయ్యలేనివికూడా) సత్యం చేసి, విజయం పొందారు. స్టిల్సు తీయడంలో ఆయనకు స్పెషల్ మార్కు వుంది. అక్కినేనికి దగ్గరివాడు. అందరికీ ఆయిన వాడు.

తన మనవడు (తాతినేని రామారావుగారి కుమారుడు) చిరంజీవి అజయ్ పేరిట చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించారు. [అజయ్ ఆర్ట్స్]

## తాతినేని మరో చిత్రం

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ వచ్చే ఏడు ప్రారంభించనున్న వర్ణ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడుగా వుంటారు.

నిర్మాత పూర్ణచంద్రరావుగారికి, తాతినేని రామారావు పర్మనెంటు దర్శకుడు. ఇద్దరి భావాలు, అభిప్రాయాలు, అభిరుచులు కలిశాయి. అందుకనే యిద్దరూ విడివడని మిత్రులయ్యారు. "ఎ గుడ్ కాంబినేషన్ యిన్ డీక్!"

## పాలబుగ్గల పడుచువాడు

"జన్మ జన్మల బంధం" వర్ణ చిత్రంలో కథానాయక పాత్రధారి కృష్ణ ఎంత అందంగా వున్నాడో తెలుసా? "పాలబుగ్గల పడుచువాడు" వలె వున్నాడు.

అగ్ర నటి వాణిశ్రీ ఎలావుందో తెలుసా? హీరోయిన్ నటివలె వుంది. కృష్ణ... వాణిశ్రీల జంట ఎలావుందో తెలుసా? రతీమన్మథులవలె వున్నారు.

దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి రూపొందిస్తున్న "జన్మ జన్మల బంధం" చిత్రంలో కృష్ణ... వాణిశ్రీ పాత్రలకు సమాన బలం, ప్రాతినిధ్యం వుంది. "ఇద్దరూ యిద్దరే" అనిపిస్తున్నారు.

సహాయ పాత్రలలో గుమ్మడి, సత్యప్రియ, సత్యనారాయణ పాత్రలు స్కోర్ చేసేవిగా వున్నాయి.

"జన్మ జన్మల బంధం" చిత్రాన్ని కన్నులపండుగ చేస్తున్న లక్ష్మణ్‌గోరే చాకచక్యాన్ని ప్రేక్షకులు ప్రశంసించకమానరు. "మామ" మ్యూజిక్‌లో కొత్తదనం వుంది. ఈ చిత్రానికి భాస్కరరావు నిర్మాత.

## శ్రీ రమణ చిత్ర కొత్త చిత్రం

మంచి చిత్రాలను నిర్మించే బహుకొద్ది సంస్థల్లో శ్రీ రమణ చిత్ర ఒకటి. మాస్‌కు నచ్చే కథలను ఎంపిక చెయ్యడంలో చలం గట్టివాడు.

శ్రీ రమణ చిత్ర పక్కా కమర్షియల్ చిత్రాన్ని ఒకదానిని తలపెట్టింది. కథ దొరికింది.

చలం... జయసుధ ప్రధాన జంటగా తీస్తున్న శ్రీ రమణ చిత్రవారి షూటింగు నవంబరులో ప్రారంభమవుతుంది. ఈ చిత్రంలో అగ్రశ్రేణి సహా తారాగణం వుండగలదని చలంగారు అన్నారు.

"మట్టిలో మాణిక్యం" ఫేమ్ బి. వి. ప్రసాద్, శృంగారన్ని దర్శకత్వాన్ని, సంగీతాన్ని నిర్వహిస్తారు.

"ఆడవాళ్లు—అపనిందలు"లో కృష్ణంరాజు, శుభ

ఈసారి ఎన్నుకున్న కథకు ప్రేక్షకుల ఆశీర్వాదం తప్పక లభిస్తుంది.

## అభినయంలో భిన్నత్వం

నృత్య దర్శకుడుగా ప్రసిద్ధి బడసిన తరువాత, దర్శకుడుగా పదవీస్వీకారం చేసి, ఆ శాఖలో కూడా సమర్థుడు అనిపించుకున్న కె. ఎస్. రెడ్డికి ధనలాభాన్ని తెచ్చిపెట్టే సామత "సీతమ్మ సంతానం" చిత్రానికి వుంది.

ఈ చిత్రంలో చలం పల్లెవాడుగా, పట్నవాసం వ్యక్తిగా వైవిధ్యం వున్న నటన్ను అద్వితీయంగా ప్రదర్శించాడు. నాగభూషణం పాత్రలో త్రిల్ వుంది.

యువతరాన్ని వుత్తేజపరిచి, వుత్సాహపరిచి, ఆకర్షించే చలాకీ పాత్రలో జయసుధ బలేగా రాణించింది. మహిళల సానుభూతిని సంపాదించే పాత్రలను హేమలత, రోజారమణి పోషించారు. ప్రభాకరరెడ్డి నటనలో డిగ్నిటీ వుంది.

ఒక వినోదాత్మక చిత్రాన్ని, ఒక కరుణాత్మక చిత్రాన్ని నిర్మించిన మురళీ అభినందనీయుడు.

## పి. ఏ. పి. లో మేటి తారాగణం

ప్రజలకు నచ్చే చిత్రాలను నిర్మించి, వున్నత స్థాయిని చేరిన సంస్థగా ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌ను పేర్కొనవచ్చు. నిర్మాత ఎ. వి. సుబ్బారావుగారు కల్మషం లేని బహు మంచి మనిషి. ఎందరికో అజ్ఞాతంగా ఆర్థిక సహాయం చేసిన బంగారు మనిషి. అక్కినేనితో ఎక్కువ చిత్రాలను నిర్మించిన నిండు మనిషి. మనసున్న మనిషి.

అక్టోబరు రెండున అన్నపూర్ణా స్టుడియోస్‌లో ఎ. వి. సుబ్బారావుగారు తన భారీ వర్ణ చిత్రాన్ని ప్రారంభిస్తున్నారు. ఆ చిత్రంలో మేటి తారాగణం పాల్గొంటున్నారు.

అక్కినేని, శారద, గుమ్మడి, సత్యనారాయణ, జయసుధ, ప్రభ వంటి పేరొందిన తారలు ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.



### జయసుధ స్థానం ఏమిటి?

ఈనాడు పరిశ్రమలో అయితేనేమి, ప్రజల్లో అయితేనేమి కొత్తవాళ్లకు బలమయిన స్థానం ఏర్పడింది. అలాంటి సత్సంఘటన జరుగుతూంది గాబట్టే, జయత్రయానికి డిమాండు పెరిగింది.

జయత్రయంలో కూడా ఎక్కువ చిత్రాలు వేస్తున్నది, వైవిధ్యం వున్న వేషాలు వేస్తున్నది జయసుధ మాత్రమే.

### అక్కినేని జోస్యం!

''నటసామ్రాట్'' ఆశీర్వదించిన వ్యక్తులందరూ వున్నత పదవుల్లో వున్నారన్న నిజం అందరికీ తెలుసు. అక్కినేనిగారు జయసుధను ''హోప్‌ఫుల్ స్టార్''గా పేర్కొన్నారు.

### విజయ రహస్యం!

ఒకనాడు సరోజాదేవి, మరోనాడు జయలలిత సంపాదించిన స్థానాన్ని యీనాడు జయసుధ పొందగలగడానికి కారణం లేకపోలేదు.

అందచందాలు భగవంతుడిచ్చాడు; నటనాప్రతిభను కృషితో ఆర్జించింది. గుడ్ బిహేవియర్ కూడా తోడయ్యింది.

### ప్రముఖ చిత్రాల్లో స్థానం

ప్రజలచేత వుత్తమ సంస్థలుగా కీర్తింపబడుతున్న అన్నపూర్ణ పిక్చర్స్, డి. వి. ఎస్. ప్రొడక్షన్స్, మారుతీ ప్రొడక్షన్స్, సత్యచిత్రవారి చిత్రాలలో నాయిక వేషం సుధకు లభించడం ముదావహం.

### నెరవేరిన కోరిక

''ఆంధ్రుల అందాల అగ్రనటుడు'' నాగేశ్వరరావుగారితో శృంగార నాయికగా నటించాలన్న కోర్కె జయసుధకు వున్నట్టు యీ విలేకరితో అనేకసార్లు వ్యక్తపరిచింది.

రాబోయే కొత్త సంవత్సరం అక్కినేనిగారితోనే జయసుధ సినిమా జీవితం ఆరంభమవుతుంది.

శీను... బుజ్జి ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మిస్తున్న ''ఓ మై డార్లింగ్'' చిత్రంలో నాగేశ్వరరావు... జయసుధ ప్రధాన జంటగా నటించగలరని, దర్శకుడు భీమేశ్వరరావు చెప్పారు. ఈ చిత్రానికి కోనా అప్పారావు నిర్మాత.





''వధూవరులు''లో రమాప్రభ, పద్మనాభం

### బ్రదర్ యీజ్ సుపర్బ్

రెండు వారాల క్రితం పాఠకులు చదివే వుంటారు, బ్రదర్ యీజ్ ఎ గ్రేట్ డైరెక్టర్ అని అక్కినేని అన్న మాటలు.

''చాణక్య...చంద్రగుప్త'' పాత్రలు అక్కినేని, నందమూరి పోషించి, చరిత్రను కళ్లెదుటకు తెస్తున్నారు అన్న భావం లక్షలాది ప్రజలకు వుంది.

రెండు సింహాలు కలిసి, స్నేహంగా, సంతోషంగా వుండడం, యిద్దరూ కలిసి పని చెయ్యడం పట్ల అసూయ ఏ ఒక్కరికీ వుండదు.

చాణక్య పాత్రను బ్రదర్ అద్వితీయంగా పోషించారు, అన్నారు 'నటరత్న' రామారావు. బ్రదర్ రామారావుగారు చాణక్య పాత్రను అపురూపంగా సృష్టించారు, అన్నారు నటసమ్రాట్.

ఆ చిత్రంలో పని చేసిన ప్రతి నటుడు చాణక్యుడుగా అక్కినేని సుపర్బ్ అని ప్రశంసించారు. ద్వాదశ వత్సరముల తరువాత ఏర్పడిన మహానటుల స్నేహం తియ్యని బంధంగా చరిత్ర ప్రసిద్ధమవుతుంది.

### సూపర్ స్టార్ ఎన్టీఆర్

తెలుగు చిత్ర రంగానికి వన్నె తెచ్చిన కథానాయకు లెందరున్నా వసూళ్ల చక్రవర్తి బిరుదానికి అర్హుడు ''నటరత్న'' మాత్రమే నన్నది జగమెరిగిన సత్యమే.

ముఖ్యంగా ఈ ఏడు ఎన్టీఆర్ అద్వితీయ స్థానాన్ని ఆక్రమించిన నిజాన్ని ఎవరూ కాదనలేరు.

### విజయ రహస్యం

ఎన్టీఆర్‌గారి విజయ రహస్యం ఏమిటని ఆలోచిస్తే, కనిపించేది ఒక్కటే. ప్రతి చిత్రంలో ఒకేరకం పాత్రను పోషించక, అన్ని తరగతులవారిని సంతృప్తిపరిచే వేషాలను చెయ్యడమే అనిపిస్తుంది.

ఎదురులేనిమనిషికీ, ఆరాధనకు, మనుషులంతా ఒక్కటేకి, నేరం నాదికాదు ఆకలిదికి, బంగారు మనిషికి వున్న తారతమ్యం జనవిదితం. ఒక పాత్ర ప్రభావం మరో పాత్రమీద ఒక్క పర్సెంటుకూడా పడకుండా, ఎంతో నేర్పుతో నందమూరి నటించారు గాబట్టే, ప్రేక్షకులు ఆయన్ను ప్రత్యేక అభిమానంతో చూశారు.

### వచ్చే చిత్రాల జాతకం

రాబోయే రామారావుగారి చిత్రాలు ఎలా వుంటాయో, యీ విలేఖరి వూహించి రాయగలడు. ఉదయమ్ ప్రొడక్షన్స్ వారి ''మా దైవం'' చిత్రంలో ప్రేక్షకులు ఆశించే రామారావు కనిపిస్తారు గనక, ఆ చిత్రానికి జయము తథ్యము.

శ్రీరామకృష్ణ చిత్ర వారి ''మంచికి మరో పేరు'' చిత్రంలో ఎన్టీఆర్ సంఘ విద్రోహుల పొగరణచిన ధీరోదాత్తుడుగా నటించారు గనక, ప్రేక్షకుల అభినందన వర్షం తథ్యం.

కొత్త సంవత్సరంలో వచ్చే ''దాన...వీర...శూర...కర్ణ'' చిత్రంలో ఎన్టీఆర్ త్రిపాత్రాభినయం పేయింగ్ ఎలిమెంటుగా వుంటుంది.

తరువాత వచ్చే ''చాణక్య ... చంద్రగుప్త'' చిత్రం తెలుగు చిత్ర జగత్తులో కని, విని, ఎరుగని చరిత్రను సృష్టించగలదన్నది అధిక సంఖ్యాకుల అభిప్రాయం. అందుకని, ఎన్టీఆర్‌ను సూపర్ స్టార్ అనడానికి ఈ కలం అభ్యంతరపెట్టడంలేదు.

### ఎన్టీఆర్ నటిస్తున్న స్కోప్ చిత్రం

''సూపర్ స్టార్'' ఎన్టీఆర్ కథానాయకుడుగా, సత్య చిత్ర నిర్మిస్తున్న వర్ణ చిత్రం సినిమాస్కోప్‌లో సింగారించుకుంటూంది. ''నటరత్న'' నటిస్తున్న మొదటి స్కోప్ చిత్రం కూడా యిదే అవుతుంది.

### మైసూర్ షూటింగు

ఫారెస్టు బ్యాక్ డ్రాప్ సత్య చిత్ర వారి కథలోని మూలవస్తువు గావడంచేత, మైసూరు సమీపాన వున్న ముదుమలై ఫారెస్టును, షూటింగు వెన్యూగా నిర్మాతలు సత్యనారాయణ... సూర్యనారాయణగార్లు ఎన్నుకున్నారు.

### జయ ద్వయం

సత్య చిత్ర వారి సినిమాస్కోప్ వర్ణ చిత్రంలో జయసుధ, జయప్రద నాయిక పాత్రలను పోషిస్తున్నారు. సహాయ భూమికలను నాగభూషణం, సత్యనారాయణ ధరిస్తున్నారు.

ఈ చిత్రానికి కె. రాఘవేంద్రరావు దర్శకుడు. రచనకు గొల్లపూడి, సంగీతానికి మహదేవన్, ఛాయకు విన్సెంట్, ప్రొడక్షన్‌కు పట్టాభి సారథులు.

# సినిమా



''దొంగల దోపిడీ''లో పద్మనాభం, నాగభూషణం

### చక్రధారి రెండవ షెడ్యూలు

లక్ష్మి ఫిలిం కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న (అన్నపూర్ణా స్టుడియోస్‌లో) ''చక్రధారి'' షూటింగు రెండవ ఘట్టం సెప్టెంబరు 15 నుంచి 30 వరకు జరగడంతో, మరో తొమ్మిది రోజుల వర్కు మాత్రమే మిగుల్తుంది, అన్నారు సమర్పకురాలు కృష్ణవేణి.

హైదరాబాదులో ఏ మాత్రం యిబ్బంది కలగకుండా, షూటింగు నిర్విఘ్నంగా సాగడానికి, తమ చిత్ర నాయకుడు నాగేశ్వరరావుగారు యిస్తున్న సహకారానికి, నిర్మాత అనురాధాదేవి పత్రికా ముఖంగా కృతజ్ఞతలు తెలుపుతూంది.

చక్రధారిగా సమ్రాట్, ఆయన అర్ధాంగిగా అగ్రనటి అద్వితీయంగా నటిస్తున్నట్టు, షూటింగును చూచిన ప్రేక్షకులు యీ విలేఖరితో అన్నారు.

శ్రీకృష్ణుడుగా రామకృష్ణ బహు అందంగా, సుందరంగా వున్నారనికూడా వీక్షకులు చెప్పారు.

### డిశంబరు విడుదల

''చక్రధారి'' వర్ణ చిత్రాన్ని డిశంబరులో విడుదల చేసే వుద్దేశ్యం నిర్మాతకు వుంది.

ఈ భక్తి చిత్రంలో సత్యనారాయణ, రాజబాబు, అల్లు రామలింగయ్య, వెన్నిరఆడై నిర్మల, రమాప్రభ మరియు జయప్రద ప్రధానపాత్రధారులు.

''చక్రధారి'' చిత్రంలోని పాటలను విన్నవాళ్ళు, సంగీత దర్శకుడి (జి. కె. వెంకటేష్) మేధస్సును కొనియాడుతున్నారు. ఈ భారీ వర్ణచిత్రానికి విక్టరీని చేకూర్చే బాధ్యతను మధుసూదనరావు, సెల్వరాజ్, వాలి స్వీకరించారు.

ప్రేక్షకులు ''చక్రధారి''ని నమ్మొచ్చు.

### ప్రతిభావంతురాలు భానుమతి

చలనచిత్ర చరిత్రలో డాక్టర్ భానుమతికి వున్న స్థానం అనితరసాధ్యమైనది. ఆమెకు తెలియని విద్యంటూ లేదు. ఆమె సాధించిన విజయాలు, గడించిన బిరుదులు అనన్యములు.

భరణీ పిక్చర్స్ నిర్మించిన ''మనవడికోసం'' చిత్రంలో డాక్టర్ భానుమతి తన విశ్వరూపాన్ని ప్రదర్శించింది. నటిగా, దర్శకురాలుగా, సంగీత దర్శకురాలుగా, గాయకురాలుగా భానుమతి నెంబర్ వన్‌గా నిలిచింది.

''మనవడికోసం'' చిత్రంలో కరుణ, హాస్య రసాలు సమాన స్థానాన్ని ఆక్రమించాయి. అందరినీ ఆకర్షించే చిత్రమవుతుంది ''మనవడికోసం.''

ఈ చిత్రంలో శ్రీధర్, కాంతారావు, నాగేష్, రోజారమణి, పండరీబాయి, విధుబాల, ఛాయాదేవి, త్యాగరాజు, పద్మనాభం, సుకుమారి ప్రధాన పాత్రలను పోషించారు.

### శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజస్ !

అందించిన చిత్రాలన్నీ ఆణిముత్యాలే. మరి యీసారిమాత్రం అలా చెయ్యకుండా వుండగలరా ? కథ ఎంపిక జరగ్గానే, మకుటం నిర్ణయించేసే మంచి అలవాటు నిర్మాత క్రాంతికుమార్‌కు వుంది.

### కల్పన

గా జయచిత్ర నటిస్తున్నట్టు, నాయకుడుగా మురళీమోహన్ నటిస్తున్నట్టు, సహాయ పాత్రలను గుమ్మడి, సత్యనారాయణ, గిరిబాబు, అల్లు రామలింగయ్య, రావుగోపాలరావు పోషిస్తున్నట్టు నిర్మాత క్రాంతికుమార్ చెప్పారు.

ఆగస్టు యిరవైనుంచి చిత్తూరు జిల్లాలోని అరినియర్ డామ్ వద్ద నాలుగురోజులు షూటింగు కూడా జరిగింది. (మురళీమోహన్, జయచిత్ర పాల్గొన్నారు.)

''జ్యోతి'' చిత్ర విజయానికి కారకులయిన అందరూ ''కల్పన''కు పని చేస్తుండడం ముదావహం.

దర్శకత్వం : రాఘవేంద్రరావు; సంగీతం : చక్రవర్తి; సహదర్శకులు : రామ్‌సూరి, ప్రేమ్ కుమార్; కూర్పు : అంకిరెడ్డి; ఛాయ : ప్రకాష్; రచన : సత్యానంద్.

### రాజా పాటలు రతనాలు

మారుతీ ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన ''రాజా'' చిత్రం తాలూకు అయిదు పాటలను యీ విలేఖరి చూశాడు. చూచిన ప్రతి పాట వుషారుగా, వుత్తేజంగా, విశిష్టంగా వుందని రాసే ధైర్యం యీ కలానికి వుంది.

''హీ-మాన్'' అభినయంలో స్టెప్స్‌లో కొత్తదనం కనిపించింది శృంగారం చెయ్యడంలో తనే సాటి అని జయసుధ ఋజువు చేసింది.

'రాజా'లోని పాటలు రతనాలు అని రాస్తున్న యీ రచయిత వాక్యాలను ప్రేక్షకులు వొప్పుకుంటారు. సంగీత దర్శకుడు చక్రవర్తి 'శారద... జ్యోతి' చిత్రాలను తలదన్నే బాణీలను ''రాజా''లో కూర్చారు.

పాటల చిత్రీకరణ చెయ్యడంలో రాఘవేంద్రరావుకు ప్రత్యేకమైన నేర్పు వుందనిపించింది.

''రాజా'' వర్ణ చిత్రం నిర్మాత ఎ. ఎల్. కుమార్‌కు, లక్ష్మి ఫిలింస్‌కు ధన విజయాన్ని ఆర్జించిపెడుతుంది.



''తూర్పు-పడమర''లో శ్రీవిద్య, నరసింహరాజు

డిటెక్టివ్ రెడ్ గా M.G.R. నటించిన హరిప్రసాద్ కంబైన్స్

# ప్రేమా-ధర్మమా

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: వి. జగన్నాద్ B.A.,   సంగీతం: M.S. విశ్వనాథం





"మొనగాడు"లో శోభన్, మంజుల

**అందాల కృష్ణుడు !**

మాధవి... పద్మాలయా కంబైన్స్ సినిమా స్కోప్ వర్ణచిత్రంగా రూపొందిస్తున్న "కురుక్షేత్రం" రాకెట్ వేగంతో తయారవుతూంది.

ఈ మధ్య వాసు స్టుడియోలో జరిగిన పెద్ద షెడ్యూలులో ముఖ్యపాత్రధారులందరుపాల్గొన్నారు.

శ్రీకృష్ణుడుగా శోభన్ ఎంతో అందంగా, ముద్దుగా, మురిపెంగా అగుపించారు. కృష్ణుడు పాత్రలో శోభన్‌కు విజయము తథ్యము అనిపించింది. ఆ పాత్రకు వలసిన చలాకీతనం, చిలిపితనం, గంభీరత్వం శోభన్ చక్కగా ప్రదర్శిస్తున్నారు.

పాండవ మధ్యముడుగా కృష్ణ చాలా చక్కగా వున్నారు. ఆ పాత్రకు వలసిన వీరోచిత, శృంగార లక్షణాలను విలక్షణంగా చూపెడుతున్నారు.

కృష్ణార్జునులు సమవుజ్జీలుగా వుండడంవల్ల, అనుభవజ్ఞుడు కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం నెరపడంవల్ల, "కురుక్షేత్రం" చిత్రానికి ప్రజామోదం తప్పదు. ఈ భారీ చిత్రానికి ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు, రాజేంద్రప్రసాద్ నిర్మాతలు.

**మొనగాడు మన అందగాడు**

అందాల నటుడు శోభన్‌బాబు అద్వితీయంగా నటించిన "మొనగాడు" వర్ణచిత్రం సెప్టెంబరులో ఆంధ్ర ప్రేక్షకులను దర్శిస్తుంది.

# సినిమా

ఒకే రూపం గొన్న, వైవిధ్య స్వభావాలున్న అన్నదమ్ములుగా "హీ-మాన్" ఎంతో వాకచక్యాన్ని ప్రదర్శించారు.

శోభన్‌బాబుగారు చెయ్యడానికి "మొనగాడు" చిత్రంలో అన్ని రసాలు వున్నందువల్ల, నవరసాల్లో రాణించాడు మన అందగాడు.

"హీ-మాన్"కు యిద్దరు గ్లామర్ క్వీన్స్ తగిలారు "మొనగాడు' చిత్రంలో. మంజుల... జయసుధ పోటీపడి శృంగారాన్ని ప్రదర్శించారు.

దర్శకుడు టి. కృష్ణ "మొనగాడు" చిత్రాన్ని సర్వజనరంజకంగా రూపొందించిన నిజాన్ని ప్రేక్షకులు అంగీకరిస్తారు. విజయలక్ష్మి ఆర్ట్స్ పిక్చర్స్‌కు (త్రివిక్రమరావు) విజయాన్ని యిస్తుంది "మొనగాడు" చిత్రం.

**ఏడడుగుల అనుబంధం**

బాబు ఇంటర్నేషనల్ నిర్మిస్తున్న "ఏడడుగుల అనుబంధం" చిత్రాన్ని దర్శకుడు లక్ష్మీదీపక్ బహుజనరంజకంగా రూపొందిస్తున్న నిజాన్ని పది రీళ్ల చిత్రం సాక్ష్యం చెప్పింది.

సంభాషణలకర్త మద్దిపట్ల సూరి కలం ఎంత పదునయినదో, ఎంత బలమయినదో యీ చిత్రం తెలియచేస్తుంది.

పాత్రపోషణలో జయసుధకు ఫస్టుమార్కులు యివ్వాలి. తరువాత పేర్కొనదగినవారు వరుసగా ప్రభాకరరెడ్డి, కృష్ణకుమారి, నారాయణరావు, జయలక్ష్మి మరియు మాడా.

ఛాయాగ్రహణానికి దేవరాజ్, సంగీతానికి చక్రవర్తి సారథులయ్యిండ, ఆ శాఖల్లో వెల్తిరాగలదా ?

ఒక చక్కటి చిత్రాన్ని, చిక్కటి కథావస్తువున్న చిత్రాన్ని అందిస్తున్న వెంకటేశ్వరరావు ... బాబుగార్లకు అశేష ఆంధ్రప్రజల ఆశీస్సులు లభిస్తాయి.

చిత్ర నిర్మాణంలో ప్రొడక్షన్ మేనేజరు గట్టివాడై వుండాలి. నిర్మాతలకు రామకృష్ణ (గట్టివాడు) దొరికాడు.

**ఆనందోత్సాహం !**

చిత్ర నిర్మాణంలో సంగీతం ప్రముఖ స్థానాన్ని నిర్వహిస్తున్న నిజం అందరికీ తెలుసు. సంగీతం బాగుండికూడా, పాడే వ్యక్తి సరిగ్గా పాడలేకపోతే, చిత్రానికి యిబ్బంది కలుగుతుందన్న నిజం కూడా అందరికీ తెలుసు.

తెలుగు చిత్రరంగంలో బాలసుబ్రమణ్యం తరువాత వచ్చిన గాయకుల్లో శుభ్రంగా, అపశ్రుతి లేకుండా పాడే శక్తి ఎవ్వరికీ లేదంటే, అబద్ధం అవుతుందా ?

ఒక నటుడు మనకు వున్నాడనుకుని, యిష్టంవచ్చినట్టు పాడితే, ప్రజలు పిచ్చివాళ్లు కారు ... ఒప్పుకోవడానికి.

సంగీతాన్ని సంగీతంవలె చెప్పగల విద్యను యువ గాయకుడు ఆనంద్ అభ్యసించాడు.

ఇటీవల ఆనంద్ పాడిన రెండు అపురూపమైన పాటలను విన్నవాళ్లందరూ గొప్పగా చెప్పారు. అలా చెప్పినవారిలో ప్రముఖులుకూడా వున్నారు.

*చక్రవర్తి మెచ్చి,*

**వెంకటేష్ యిచ్చిన పాటలు**

ఆనంద్ వుత్సాహపడే విధంగా, శ్రోతలు ఆనందించే విధంగా మన సంగీత దర్శకులు చక్రవర్తి, వెంకటేష్ రెండు మంచి పాటలను పాడించారు. అవేమిటనగ.

**కల్పన**

శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్ ప్రైజస్‌వారి "కల్పన" చిత్రానికిగాను, వేటూరి సుందర రామమూర్తి రాసిన "సిరిమల్లె నవ్వుల సీతమ్మ; ముందుకు రావే ముద్దులగుమ్మ" అనెడి పాటను చక్రవర్తి ఆనంద్‌చేత పాడించారు.

**అమెరికా అమ్మాయి !**

నవత చిత్రవారి "అమెరికా అమ్మాయి" చిత్రానికిగాను, గోపీ రాసిన "ఒక వేణువు వినిపించెను అనురాగ గీతిక" అనెడి పాటను జి. కె. వెంకటేష్ ఆనంద్‌చేత పాడించారు.

మన సంగీత దర్శకులు నిష్పక్షపాత వైఖరిని అవలంబిస్తే, బాలు తరువాత ఆనంద్‌ను ధైర్యంగా బలపరచవచ్చు.



"మా దైవం"లో రామారావు

## బాబీ లాంటి కథ

అక్కినేనితో యువ దర్శకుడు భీమేశ్వరరావు తలపెట్టిన వర్ణచిత్రానికి "ఓ మై డార్లింగ్" అని యిడివ పేరు పెట్టగా, వేలాది అభిమానులు ఆనందాన్ని వ్యక్తపరిచినట్లు, ఆ చిత్ర నిర్మాత కోవ అప్పారావు యీ వార్త రచయితకు చెప్పారు.

కథను గూర్చి రెండు వాక్యాలు చెప్పారు, కథకుడు ... దర్శకుడు భీమేశ్వరరావు. "అక్కినేని గారిది రొమాంటిక్ రోల్ అని, ఆయన్ను వెంటాడే చిలిపి పాత్ర జయసుధదని, 'బాబీ' లాంటి లవ్ స్టోరీ తన కథలో ముఖ్యత్వం వహిస్తుందని", చెప్పారు.

## మొదటి కాంబినేషన్

రొమాంటిక్ కింగ్ నాగేశ్వరరావు ... గ్లామర్ ప్రిన్సెస్-జయసుధ కలిసి నటించే "ఓ మై డార్లింగ్" చిత్రానికి ప్రమాళ్ల వర్షం తథ్యం.

నేటి యువతరాన్ని ఆకర్షిస్తున్న తార జయసుధ అని రాసే ధైర్యం యీ విలేఖరికి లేకపోలేదు.

## డి. వి. ఎస్. లో శోభన్ పాత్ర

ప్రముఖ చిత్ర నిర్మాత డి. వి. ఎస్. రాజుగారు ప్రారంభించిన వర్ణచిత్రంలో శోభన్‌బాబు అపురూపమయిన పాత్రను పోషిస్తున్నారు. "జీవనజ్యోతి" చిత్రంలో అగుపించిన వెరైటీ కొత్త చిత్రంలో కూడా వుంటుంది, అన్నారు నిర్మాత రాజుగారు.

కథలో హీరో లేని షాటు లేదుగాబట్టి, నవరసాలున్న పాత్రగా హీరో వేషం వచ్చిందిగాబట్టి, శోభన్ విజృంభించడం ఖాయం.

డి. వి. ఎస్. రాజుగారి కొత్త చిత్రంలో జయసుధ, జయప్రద, రాజబాబు, అల్లు రామలింగయ్య, ముక్కామల ప్రధాన పాత్రధారులు.

పాటలకర్త డాక్టర్ రెడ్డి, స్వరకర్త మహదేవన్, సంభాషణాలకర్త సముద్రాల డి. వి. ఎస్. కు పూర్తి న్యాయం చేస్తున్నారు.

అగ్రశ్రేణి దర్శకుడు విశ్వనాథ్ గారు కథ రాసి, చిత్రానువాదం సమకూర్చి, దర్శకత్వాన్ని నిర్వహిస్తున్న డి. వి. ఎస్. రాజుగారి కొత్త చిత్రం కొత్త సంవత్సరంలో వస్తుంది. — శ్రీనివాస్



పశ్చిమ గోదావరిజిల్లా జంగారెడ్డిగూడెంలో లక్ష్మీటాకీసు ప్రారంభ సమయంలో ఆగస్టు 28న సినీతార వాణిశ్రీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుకు కుటుంబ నియంత్రణ ఉద్యమ సహాయార్థం లక్ష రూపాయల విరాళాన్ని చెక్కుద్వారా అందించారు







## భాగవతుల లలితశర్మ

రోజంతా లోకానికి తన వెలుగుని, వేడిని ధారపోసి అలిసిపోయిన సూర్యుడు పడమటి కొండల్లోకి జారిపోతూన్న వేళ, రోజంతా తన శక్తిని శ్రమని ఆఫీసుకి ధారపోసిన సూర్యనారాయణగారు కూడా అలసిన ముఖంతో ఇంటి దారి పట్టేరు. బొత్తిగా ఓపిక లేని ఆయన కాళ్ళు అడుగు ముందుకెయ్యడానికి ఏమాత్రం సహకరించడంలేదు. కాని ఎలాగో అలాగ యీ శరీరాన్ని ఇంటికి జేరవెయ్యక తప్పదు కదా! పరధ్యాన్నంగా నడుస్తున్న ఆయన పక్క నుంచి రిక్షా ఒకటి రివ్వున దూసుకుపోయింది. 'నయం కదూ! కాస్తలో తప్పింది.' తల పక్కకి తిప్పి చూసేరు సూర్యనారాయణగారు. ఆ రిక్షాలో పోతూన్న అదృష్టవంతుల్ని తల్చుకొని ఆయన మనసు బాధగా మూలిగింది ఒక్క క్షణం.

తనుకూడా అలా రిక్షాలో హాయిగా వెళ్ళడానికి అతని "జేబు" అంగీకరించదు. ఆయన ఉద్యోగంలో చేరినప్పటినుంచి 'అది' ఇలాంటి అనవసర ఖర్చులకి అభ్యంతరం చెప్తూనేవుంది. ఔను మరి! ఆ డబ్బులు వుంటే 'చిన్నాడి' పుస్తకానికేనా పని కొస్తాయి. తనతో పనిచేసే వాళ్లంతా సైకిళ్ల మీదో మరీ దూరమైతే బస్సుమీదో ఆఫీసుకొస్తూ వుంటారు. ఇన్నేళ్ల సర్వీసులో ఒక సైకిలు కొనుక్కోలేకపోయేడు. ఎప్పటికప్పుడే సముద్ర తరంగాల్లా ఏవో ఖర్చులు... బస్సులో వద్దామంటే... అమ్మో... నెలకి 15 రూపాయలైనా అవుతుంది. అవుంటే కాంతానికి ఓ టానిక్కు సీసాయేనా వస్తుంది. "రోజల్లా చాకిరీయే పాపం, దానికి! రెస్టు తీసుకోమంటాడు డాక్టరు! గుమస్తాల పెళ్ళాలికి రెస్టులు, టానిక్కులు అందుకోలేని దూరంలో వుంటాయి" — అన్న విషయం డాక్టర్లకి తెలీదూ?... అబ్బే, తెలుసు! అలా అనడం వాళ్ల వృత్తిధర్మం!" బస్సు మానుకుంటాడే కాని ఆ డబ్బులు టానిక్ కొనేదాక ఎక్కడాగుతాయి? ఏ కుట్టు క్లాసుకో కావాలని చిన్నమ్మాయి సరళ పట్టుకుపోతుంది. దాన్ని చూసి మూడోది రమ కూడా తయారవుతుంది 'నేనూ నేర్చుకుంటా' అంటూను.

ఎదిగిన కూతుళ్ళు, ఇటు పెళ్లీ చెయ్యక, అటు చదువూ చెప్పించకపోతే ఏం చేస్తారు ఇంట్లో కూర్చొని! మనిషన్నాక ఏదో వ్యాపకం... తను ఎవరి సరదాలు చంపలేదు. అందుకే తన అవసరాలు చంపుకుంటాడు. ఆలోచనలోపడి మెల్లిగా అడుగులు వేస్తున్న సూర్యనారాయణగారి కాళ్ళకి ధర్మాసుపత్రి గేటు దగ్గర అనుకోకుండా బ్రేకు పడింది. అక్కడ పళ్ళ దుకాణంలో — బత్తాయిపళ్ళు, ఆపుల్స్, ద్రాక్ష... ఇంకా చాల రకాలు పెట్టేడు. ఆయనకి అప్రయత్నంగా తల్లి జ్ఞాపకం వచ్చింది. ఆవిడకి వారంలో నాలుగు రోజులు ఉపవాసాలూ లేకపోతే ఒక్క పొద్దు అనో వుంటూనే వుంటాయి — అలాటప్పుడు రోడ్డు చివర కిల్లీ కొట్లో — మాగిపోయి నల్లబడిపోయిన అరిటిపళ్లే తెప్పించుకుంటుంది 'చిన్నాడి'చేత. ఆవిడకి ఇంత మంచి బత్తాయిపళ్ళు యీ జన్మలో కొని యివ్వగలడా తను! తన ప్రయత్నం లేకుండానే మరొకసారి చూసేరు ఆయన పళ్ళవేపు. రోజుకి రెండుసార్లు చొప్పున వాటిని చూస్తూనేవుంటారు ప్రతి రోజూ — అయితే ఆ చూడ్డంలో ఆత్రుతకాని, ఆనందంకాని వుండవు. ఏట్లో పడి కొట్టుకుపోతున్నవాడు, ఒడ్డునున్నవాడి చేతివేపు చూసే చూపుల్లాగా, నిస్సహాయంగా, నిస్పృహగా వుంటాయి ఆయన చూపులుకూడా! వాడి ధర్మవాని — ఆ పళ్లవాడు — చూడ్డానికి ఇంకా 'రేటు' పెట్టలేదు.

ఆలోచనలమధ్య నడుచుకుంటూ మార్కెట్లోకి ఎప్పుడు వచ్చాడో ఆయనకే తెలీదు! 'షో' కేసుల్లో మెరిసిపోతున్న జరీ చీరలు చూడగానే పండగకి రాబోతూన్న 'పెద్దమ్మాయి' జ్ఞాపకమొచ్చింది. క్రిందటిసారి పెట్టిన బట్టలు బాగు లేదని, అత్తవారింట్లో అందరూ సాధించేరుట అమ్మాయిని! అది వాళ్లమ్మని సాధిస్తోంది ఉత్తరాల్లో!

సముద్రంలో పెద్ద చేపలు చిన్నచేపల్ని మింగేస్తున్నట్టు, తన బుర్రలోని పెద్ద సమస్యలు

చిన్న చిన్న సమస్యల్ని మింగేస్తున్నాయి. పండక్కి రాబోయే అమ్మాయి అల్లుళ్ల సమస్యముందు, అంతకు ముందున్న బెంగలన్నీ రూపు లేకుండా పోయేయి. ఒక్కొక్కసారి ఆఫీసుపనిలో ఉన్నప్పుడూ, ఇవే ఆలోచనలూ ఇవే సమస్యలు తన మనసులో, తెరవెనుక నీడల్లాగా మెదుల్తూనేవుంటాయి. ఆఫీసు మెట్లు దిగగానే అవి, తెర తీయగానే రంగంలోకి దూకిన నర్తకీమణుల్లాగా నిరభ్యంతరంగా నాట్యం చెయ్యడం మొదలుపెడ్తాయి తన మస్తిష్కంలో.

మనిషికి ఆలోచనాశక్తి అన్నది ఒక వరంగానే ప్రసాదించేడు భగవంతుడు -- కాని రాను రాను అదో పెద్ద శాపంలాగా తయారవుతోంది సూర్యనారాయణ గారిలాంటి అతి సామాన్యులకి.

* * *

భార్య యిచ్చిన, కాఫీ పోలికలున్న ద్రవాన్ని సేవించి అప్పడే వాలుకుర్చీలో మేనువాల్చి భగవద్గీ తను చేతుల్లోకి తీసుకున్నారు సూర్యనారాయణగారు. మనసుని తాత్కాలికంగా శాంతింపజేసేది అదొక్కటే ఆయనకి ప్రపంచంలో. గుర్తుగాపెట్టిన పేజీలు తెరవబోతూవుంటే వెనక ఎవరో తచ్చాడుతూన్నట్టు అనిపించింది. 'పెద్దాడు' రామం! తనతో అవసర మున్నప్పడే అలా మొహమాటంగా తచ్చాడుతాడు తన కుర్చీ వెనకాల! వాడికేం కావాలో తనకి తెలుసు. తెలిసినా తను యివ్వలేడని వాడికీ తెలుసు. అయినా తనకి అడగక తప్పదు – వాడికి చెప్పకా తప్పదు! భగవద్గీత పక్కనపెట్టి బరువుగా నిట్టూర్చారు ఆయన 'ఏరా? ఎప్పుడు కట్టాలి డబ్బు!' కొడుకు మొహంలోకి చూసే శక్తి లేనట్టు పైకి చూస్తూ అడిగేరాయన తండ్రి మొహంలోకి చూసే ధైర్యం ఆ కొడుక్కీ లేదు! 'కనీసం రేపేనా కట్టకపోతే ఇంక ఆ ఉద్యోగానికి నీళ్లు వదులుకోవాల్సిందే నాన్నా!' ఎటో చూస్తూ జవాబు చెప్పేడు వాడు. 'ఔను! వాడు నాలుగు రోజుల క్రిందటే చెప్పేడు తనకి – రేపటిలోగా లంచం ఇవ్వగలిగితేనే ఆ ఉద్యోగం తన కొడుక్కి దొరుకుతుంది. అప్పటినుంచి ప్రయత్నిస్తూనే

# 'పోలియో'కి మందు కనుగొన్న వైద్యుడు!

పోలియో వ్యాధి నిరోధానికి వాక్సిన్ వుందేగాని, అది సోకిన తరువాత దానికి, యిప్పుడు అమలులో వున్న వైద్య పద్ధతులలో చికిత్స లేదు, మందు లేదు అన్నది ఎందరికో తెల్సును కాని గుడివాడ హోమియోపతి కాలేజీలో లెక్చరర్ అయిన హోమియోపతి వైద్య పట్టభద్రుడైన నలభైయ్యో పడిలో వున్న డా. తాళ్లూరు శివరామకృష్ణయ్య మాత్రం పోలియో "కరచిన" కాలైనా, చెయ్యైనా మళ్లీ కండ పట్టి మామ్మూలుగా కదులాడేలాగ పని చేసే "మందు గొట్టాలు" తాను "హోమియోపతి" మూల పదార్థాలతో తయారుచేసేనని – నిర్ధారణగా చెబుతున్నారు

గుంటూరు జిల్లాలోని చిలకలూరిపేట, (విజయవాడకి 80 కిలోమీటర్లు సుమారు) అంత ప్రయాణ సౌకర్యంగాని, వసతి సౌకర్యంగాని వున్న వూరు కాదుగాని, అక్కడే గత 13 మాసాలుగా, యీ వైద్యుడు 'పోలియో కేంద్రం నిర్వహిస్తున్నారు. శనివారం రాత్రికి దేశంలోని చాలా దూర ప్రాంతాలనుంచి కూడా పోలియో వాత పడ్డ పిల్లల్ని తీసుకుని వందలకొలది తల్లిదండ్రులు ఆ వూరు చేరుకుంటారు ఆదివారం ఉదయం అక్కడే గల ఒక 'లాడ్జి' మొత్తం వో 'క్లినిక్'గా మారిపోతుంది— మూత్ర పరీక్ష, రక్త పరీక్ష, కేసు వివరాలు వయసు, పేరు మొదలైనవాటిని, నమోదు చేయడం యివన్నీ 'చక చక' జరిగిపోయాక, చిన్న గదిలో డా శివరామక్రిష్ణయ్య, కాలు లేదా చెయ్యో, ఒక్కో కేసులో రెండూ సన్నబడిపోయిన లేదా మెలితిరిగిన – ఏడాది నుంచి పన్నెండేళ్లదాకా వయస్కులైన బాల బాలికల్ని పరీక్ష చేస్తారు. ఆ గదిలో దేవుడు పటాలు లేవు, బాబాల పటాలు లేవు, "మావో", "లెనిన్‌ల" బొమ్మలూ లేవు – 'యంత్రవతు'గా కేసును స్టడీ చేసి మందుల చీటీ యివ్వడమే డాక్టర్ రాత్రి ప్రొద్దుపోయేదాకా చేసే పని కేసు తీవ్రతనిబట్టి– "గొట్టాం మాత్రలు" మోతాదు మారుతుంది.. [వందకి పైబడి వుంటాయి కేసులు]

ఆరు మాసాల నుంచి వస్తున్నవాళ్లున్నారు, ఆరు వారాల క్రితంనుంచి మందు ప్రారంభించిన వాళ్లున్నారు – పత్యం మాంసాహారం కూడదు, గోంగూర, వంకాయ నిషిద్ధం .. అక్కడ వెయ్యికి పైగా కేసులు వాటి వివరాలు నమోదై వున్నాయి. "డొల్లగా వున్నచోట, పోలియో "తిని" వదిలిన ప్రాంతంలో "కండ పట్టడం" యీ మందు ప్రభావాన జరిగే గొప్ప పని" –

ఈ పోలియో మందుకు "ట్రేడు నేమ్" లేదు... షెడ్యూల్డు డ్రగ్‌గా దీన్ని షాపుల్లో అమ్మరు— డాక్టర్ శివరామక్రిష్ణయ్యగారు యీ 'ఫార్ములాని' తనే స్వయంగా తయారు చేశాడు 'పొళ్ల'ను, మందు తయారీ మొత్తాన్ని సొంతంగా చేసి, జిలాటిన్ గొట్టాల్లో ఎక్కించడానికి మాత్రం అసిస్టెంట్‌లకు యిస్తున్నాడు [మరి వేల సంఖ్యకి చేరుకుందిప్పుడు వీటి తయారీ] హైద్రాబాద్ "న్యూట్రిషనల్ రీసెర్చి కౌన్సిల్ నుంచి యిద్దరు వైద్యులు ఆమధ్య యీ 'మందు'ను కొన్ని శాంపిల్సు తీసుకుపోయారు – వారున్నూ, యీ కేంద్రం దర్శించిన పలువురు పత్రికలవాళ్లలాగే రోగులను అడ్డ ప్రశ్నలు, నిలువు ప్రశ్నలు ఎన్నో వేసి యిన్‌ఫర్మేషన్ తీసుకుపోయార"ని డాక్టర్‌గారు చెప్పారు...

శివరామక్రిష్ణయ్యగారు చిలకలూరిపేటకి దగ్గిరలో గల పల్లెటూరి రైతుబిడ్డ. పదహారేళ్ల దాకా, విద్యాభ్యాసానికే మొగ్గు చూపని అసలు సిసలు రైతుబిడ్డ – కాని అకస్మాత్తుగా దీర్ఘ వ్యాధులను నయంచేసే చిట్కాలు పట్టాలన్న

0 00 00 00 00 00 0000 00 00 00 00 00 0

డాక్టర్ పరిశీలిస్తున్న ఒక కేసును ముఖ్యమంత్రి శ్రీ జలగం పరికిస్తున్న దృశ్యం



కుతూహలంతో బందరులో పి. యు సి. పూర్తిచేసి గుడివాడ హోమియో కళాశాలలో చేరాడు డాక్టరైనాడు, అతని నిరంతరాన్వేషణ ఉబ్బసం, పోలియో, బొల్లిలాంటి వాటికి విరుగుడు మందు చెయ్యాలన్న కుతూహలంతోనే ప్రారంభమైంది -- [అదంతా వేరే పెద్ద కథ]

"వో ఏణ్నర్థం క్రితం యీ పోలియో కాంబినేషన్ కుదిరింది దాన్ని వాడిచూసిన వాళ్లల్లో మరో ఇద్దరు అల్లోపతి వైద్యులున్నూ వున్నారు."

డా. శివరామక్రిష్ణయ్య యిప్పటికి రెండు వేల కేసులయినా, పోలియో కేసులు చూసి, యీ "మందు" వాడుతున్నారు నిర్ధారణగా యిది "పని చేస్తున్నదన్న నమ్మిక కలుగుతోంది" ఈ పోలియో కేంద్రం మరికొన్ని గ్రామాలకి కూడా విస్తరిస్తోంది కాని దీన్ని "సైంటిఫిగ్గా, సిస్టమేటిగ్గా, పేటంట్ డ్రగ్‌గా చేసి వారమంతా పని చేసే చికిత్సా కేంద్రాన్ని నిర్వహించే మార్గం మాత్రం అంతుపట్టడం లేదనిపిస్తోంది ఈ "వండర్" డ్రగ్‌కి 'ఏసిడ్ టెస్టులు' పెట్టి, యీ ఆవిష్కర్త అయిన వైద్యుడైన రైతుబిడ్డ 'పరిశోధనని' వైద్యశాస్త్రబద్ధం చేయడమో మానడమో త్వరితంగా జరగాలి దీనికి గవర్నమెంటు, శాస్త్రవేత్తలు కూడా ముందుకు వస్తే యీ శివరామక్రిష్ణయ్యగారు సహకరించడు అనడానికి అతని మాటలనుబట్టి చూడగా ఆస్కారం లేదు. చాలా సీదాసాద మనిషిలా వున్నాడు

డా శివరామక్రిష్ణయ్య తన 'మందు' పోలియో సోకిన వెంటనే వాడితే "డామేజ్" తక్కువ లనీ, అది పోయిన తర్వాతనైతే "రికవరీ"కి ఎంతో ఎక్కువ "స్కోపు" వుందని, వాడిన అనుభవంమీద "క్లయిమ్" చేస్తున్నారు "బియాండ్ రీజనబుల్ డౌట్", యిది రుజువైతే, యింతకన్నా యిన్వెన్షన్" కోరగలమా ? –

డా శివరామక్రిష్ణయ్య కృషిమీద వైద్యనేత్తలు ప్రభుత్వం కూడా దృష్టి కేంద్రీకరించాలే తప్ప పత్రికా రచయితల "ఎండార్స్‌మెంట్" చాలదు కనుక – అది జరిగి అతన్ని సత్కరించడం జరగాలి.

-- [వీరాజీ]

వున్నాడు. ఇదివరకు తనకు అప్పయిచ్చిన వాళ్లంతా స్వానుభవంమీద తెలుసుకున్నారు ఇకమీదట యివ్వ కూడదని ఇన్నాళ్లూ అంతో యింతో ఆసరాగా వుండేది పంటమీది డబ్బు! కాని వున్న పొలంకాస్తా అమ్మాయి పెళ్లికి అమ్మేయడంతో, పరిస్థితి మరీ అధ్వానంగా తయారయింది. తను రిటైరయేనాటికి పెద్దాడు చేతికందితే కొంత నయం. ప్రస్తుతం ఉద్యోగం కొనుక్కొందికి డబ్బే! డబ్బు! డబ్బు! ... అన్నిటికీ డబ్బు కావాలి — ఎలా? ఎక్కడనుంచి వస్తుంది? ఏం చేస్తే వస్తుంది? తనని వేధిస్తున్న ప్రశ్నలకి జవాబులాగా ఆయన వెన్నుచరిచింది మధ్యాహ్నం ఆఫీసులో జరిగిన సంఘటన. వాడు — చాల పెద్ద మోతుబరిలాగా వున్నాడు— రెండుచేతుల వేళ్లకీ ఉంగరాలు మెరుస్తున్నాయి. తెల్లటి గ్లాస్కో పంచ, నల్లటి ఆకారం, గుబురుమీసాల వెనుక వికృతంగా కనిపిస్తూన్న తియ్యని విషపునవ్వు! అటూ యిటూ ఓసారి చూసి, ఐదువేళ్లతో సూచిస్తూ 'ఏమంటావ్!' అన్నట్టూ కనుబొమ్మలెగరేశాడు ఎఱువుల పంపిణీ ఆఫీసులో పాతికేళ్లుగా పని చేస్తూన్న తనకి యీ బాపతు వ్యవహారాలు, వ్యక్తులు అంటే బొత్తిగా కిట్టదు! చూసి చూడనట్టూ ఏవో ఫైల్సు వెతుకుతూ వుండిపోయేడు తను. అతను యీసారి టేబులుమీదకి వొంగి రహస్యం చెప్తున్నట్టూ 'మరో వంద కలుపుకోండి!' అన్నాడు. తన సంగతి యీ పెద్దమనిషికి తెలీదుకాబోలు! ప్రాణంపోయినా అలాంటి పని తను చెయ్యడు. అసలు తన వంశంలోనే లేదు యిలాంటి నీచపు అలవాటు! లంచం పుచ్చుకొనే వెధవబుద్ధి వుంటే యీవాడు యిలా వుండటమేం? మహరాజులా వుండును తన పని దర్జాగా! ఛీ! అలాంటి దర్జా బతుకు తన కెందుకు? యీ దరిద్రం యీ యిబ్బందులు ఒకరోజులో తీరేవికావు వాటికోసం తన నియమాన్ని బలిచెయ్యలేడు. 'వాడికి' యివన్నీ ఎలా చెప్తే అర్థమవుతుంది. ఆ పెద్దమనిషి అలాగే తన ముఖంలోకి చూస్తున్నాడు యింకా! జవాబుకోసం కాబోలు — తను 'ఊఁ' అంటే చాలు అన్నట్టూ చూస్తున్నాడు అసహనంగా. 'క్షమించండి! యిలాంటి వ్యవహారాలు నావలన జరిగేవికావు!' అంటూ యిబ్బందిగా సీట్లోంచి లేవబోయేడు తను అతని కఠినమైన ముఖంలో నుదురు చిట్లించిన తీరు — తన తెలివితక్కువతనానికి విసుక్కుంటూ న్నట్టూ వుంది గుబురుమీసాల వెనుక కనీకనబడని విషపు నవ్వులో "మడికట్టుకు కూర్చుంటే యీ రోజుల్లో బతకలేవు సుమా!" అన్న హెచ్చరిక, చేజారిన అవకాశం తిరిగిరాదు అన్న బెదిరింపు వ్యక్తమవుతున్నాయి. స్థిరంగా నిలచిన ఆచూపుల్లో 'తప్పులేదు! అందరు చేస్తున్నదేగా!' అన్నట్టూ ధైర్యం నూరిపోస్తూన్నట్టూ తోస్తోంది. తనలోని మార్పుకోసమా అన్నట్టూ అలాగే ఒక నిముషం మౌనంగా నిలబడ్డాడు అతనివేపు మరోకసారి చూస్తే — ఆ విషపునవ్వు తనని కాటువెయ్యక మానదు. ఆ చూపుల్లోని బెదిరింపుకి తను లొంగిపోకమానడు ఆ కృత్రిమపు జాలిని కురిపించే చూపుల్లో, తను యిన్నాళ్ళుగా కాపాడుకుంటున్న

# తండ్రి మనసు

తన వ్యక్తిత్వం ఓడిపోక తప్పదు. అందుకే తను దించిన తల మరి ఎత్తలేదు. 'అతను విసిగిపోయి, 'సరే! ... వెళ్తాను' అనడం విని అప్పుడు తల పైకెత్తి అటు చూసేడు. 'రేపు మళ్లీ కనబడు తాను' అంటూ ఆరోలా నవ్వి కనుబొమ్మ లెగరేసి వెళ్లిపోయేడు. 'రేపటిదాక టైమిచ్చాడన్నమాట ఆలోచించుకొనేందుకు' చిన్నగా నవ్వుకున్నాడు తను

కాని ఇప్పుడు నవ్వు రావటంలేదు ఆయనకి. "వాడు మళ్లీ రేపు వస్తాడు!" అన్న విషయం పదే పదే ఆయన మనసులో సుళ్లు తిరుగుతోంది. తను వాడి విషయంలో సహకరిస్తే దానికి ప్రతిఫలం...తన అవసరాన్ని తీరుస్తుంది. నిరంతరం వేధించే ఆర్థిక సమస్యలని పరిష్కరిస్తుంది. తను 'ఊఁ' అంటే యీ క్షణంలో తన యిబ్బందులన్నీ గట్టెక్కినట్టే! తను కాదంటే ఆ అదృష్టం మరొకడిది. తను మడికట్టుకొని కూర్చుంటే మాత్రం జరిగే అన్యాయాలు జరక్కుండా వుంటున్నాయా? న్యాయానికి యీ దేశంలో చోటులేక అది ఎప్పుడో చచ్చిపోయింది. తనలాంటి ఏ ఒకరిద్దరో తాపత్రయపడి దాన్ని బతికించాలను కోడం అవివేకం. ఈ నీతీ, నియమం, తన కొడుకు నిరుద్యోగ సమస్యని తీరుస్తాయా? యీ న్యాయం, ధర్మం యీనాటి వరకట్న పిశాచాన్ని తరిమికొట్టగలవా? ఊహూఁ.. తను వాటిని బతకనిచ్చినన్నాళ్లూ అవి తనని చంపుకుతింటూనే వుంటాయి. తను గిరి గీసుకుని కూర్చున్నంతకాలం తన నీతి, నిజాయితీ తనని దుష్టశక్తుల్లాగా పీడి స్తూనేవున్నాయి. వీటినితప్పించుకుందికి ఒకటేదారి అది...అందరూ నడుస్తున్న దారే! మంచిమాటలు నాలుగు చెప్పి మనసుని జోకొట్టగలిగితే, నమ్ముకున్న ఆదర్శాలకి కాసేపు మత్తుమందు జల్లగలిగితే — ప్రాణంకన్న మిన్న అనుకొనే యీ వ్యక్తిత్వాన్ని కొన్ని క్షణాలపాటు మెడలు వంచగలిగితే — తనూ అందరిలాగే బతగ్గలడు తనూ అందరిలాగా ఏ సమస్యలూ లేకుండా మగపిల్లలకి చదువులు, ఆడపిల్లలకి మంచి సంబంధాలు, కాంతానికి ఆరోగ్యం .. అమ్మకి మంచి ఒత్తయిపళ్లూ .. తను హాయిగా కొత్త సైకిలుమీద ఆఫీసుకి .. పెద్దమ్మాయికి పండక్కి ... అబ్బ! తన చుట్టూ ఎంత అందమైన ప్రపంచం! కాని. కాని... యిది అలవాటులేని పనిగదూ! తన నియమానికి విరుద్ధమైన ఆలోచనకదూ! హృదయంలో ఏదో అసంతృప్తి! ఆదర్శాలను అమ్ముకోబోతూన్న బలహీనత ... వ్యక్తిత్వాన్ని చంపుకుంటూన్న చేతకానితనం తనని అంతరాంతరాల్లో దహించివేస్తూ వుంటే...అబ్బా! ఊహించుకుందికే అసహ్యంగా.. భరించలేనిదిగా ... తప్పదు! భరించాలి. అదే అలవాటవుతుంది. అందరికీ అంతే! మొదట్లో అలాగేవుంటుంది మరి! సుఖంగా బ్రతకాలంటే... తప్పదుమరి! అలవాటయిపోతే అంతా మామూ్మలే! సుఖంగా బ్రతకాలనుకుంటూ ఆదర్శాలను పట్టుకొని వ్రేలాడితే ఎలా? అబ్బే! ఇంక అవన్నీ మర్చిపోవాలి. తనకు కూడా గుడ్డ పెట్టనివాటి గురించి యింత ఆలోచనెందుకు! ఇంతకీ . తను

'అందుకు' సిద్ధమైనట్టేనన్నమాట! ఏమో! అంతా అయోమయంగా వుంది తను . తను కూడా ... అందరిలాగే ... అందరిలో ఒకడుగా . కళ్లముందు కదులుతూన్న అందమైన కొత్త జీవితం — దాని వెనుక వికృతంగా వికటాట్టహాసం చేస్తున్న నగ్న సత్యం — ఒకదానితో ఒకటి పోటీ పడుతున్నాయి. * * *

రోజంతా ఆఫీసు పనిలో మునిగిపోయిన సూర్యనారాయణగారు ఆరోజూ అదే సాయం సమయానికి బాహ్యప్రపంచంలో అడుగుపెట్టేరు సూర్యుడుకూడా తనలా అలసిపోయినా, దిగాలుగా దిగజారిపోతున్నట్టు అగుపించలేదు ఆయనకి ఆరోజు. పశ్చిమాద్రిని కుంకుమఛాయతో అలంక రించాలని హడావిడి పడ్తూన్నట్టూ అనిపించింది కారణం — రోజూలాగే ఉస్సురని బాధతో కాలినడకన రావడం ఆయన యీరోజున చాలమంది అదృష్ట వంతుల్లాగే రిక్షాలో వెళ్తున్నారు ఇంటికి. ఈరోజు ఆయన 'జేబు' దేనికీ అభ్యంతరం చెప్పనంత బరువుగా వుంది ఐతే ఆయన ముఖం సంతోషంతో వెలిగిపోవడంలేదు. అలాగని బాధతో కృంగిపోనూ లేదు. లోకం తీరుని ఆకళింపు చేసుకున్న గంభీరత ఆయన ముఖంలో నిండివుంది. ఇప్పుడు ఆయన మనసులో ఏ ఆలోచనలులేవు. ఆదర్శాలు అంతకంటే లేవు. ఒకటే ధ్యేయం వెంటనే డబ్బుకట్టి కొడుక్కి ఉద్యోగం 'కొని'యివ్వాలి తను రిటైరు అయ్యేలోగా వాడు చేతికందాలి. తన జీవితం చక్కబడాలి.

ఇంటిముందు రిక్షా ఆగింది. సూర్యనారాయణ గారు గబగబా గుమ్మంలో కాలుపెట్టేరు పక్కింటి పిన్నిగారు, ఎదురింటి బామ్మగారు ఈయన్ని చూస్తూనే పక్కకి తొలగి నించున్నారు ఇల్లంతా స్తబ్దుగా ... ఏదో భయంకరమైన నిశ్శబ్దం ఆవరించివుంది. ఎన్నడూ లేని యీరకమైన వాతావరణం ఆయన్ని ఉలిక్కిపడేలా చేసింది ఆయన భార్య కాంతం రోజూలాగా చిరునవ్వుతో ఎదురురాలేదు ఆవేళ పక్క గదిలోకి తొంగిచూసిన సూర్యనారాయణగార్కి అక్కడి దృశ్యం కలవర పెట్టింది. ఆయనకి ఏమీ అర్థంకాలేదు అక్కడ కాంతం గుమ్మానికి ఆనుకొని ముఖాన చెంగు కప్పుకొని ఏడుస్తోంది. మంచంలోంచి ముసలావిడ, కోడల్ని ఓదారుస్తోందో, తిడుతోందో అర్థంకాని పద్ధతిలో సణుగుతోంది. ఆడపిల్లలిద్దరు తల్లి పక్కనే చేరి దిగులుగా చూస్తున్నారు ఆఖరివాడు, తల్లి ఏడుపు చూసేమో ... అల్లరి మర్చిపోయి ముడుచుకొని కూర్చున్నాడు ఓ మూల భర్తని చూడగానే ఆవిడ దుఃఖం మరింత ఎక్కువయింది గుప్పిట్లో దాచుకున్న కాగితం మడత తీసి ఆయన కందించింది అందుకొనేటప్పుడు ఆయన చేతులు వణికేయి. చూపులు అక్షరాలవెంట పరుగులెత్తాయి

"నాకోసం వెతకవద్దు! యీ పరిస్థితిలో నిరుద్యోగిగా బ్రతికే ధైర్యంలేక జీవితంనుండి తప్పుకుంటున్నా" — మీ రామం

"ఆదర్శాన్ని అమ్ముకున్నా, జీవితంలో ఓడిపోయిన వ్యక్తిని నేను!" అంటూ ఆయన మనసు రోదించింది

# హార్లిక్స్ ఆరోగ్యం.
# నాడూ, నేడూ, ఎల్లప్పుడు కూడా.
## అంటుంది సుచిత్ర

**హార్లిక్స్ ఆరోగ్యంతో మీ కుటుంబపు భవిష్యత్తు తీర్చి దిద్దుకోండి.**

ఆరోగ్యమే మహా భాగ్యం. విజయాలు, ఆనందం. ఆరోగ్యంగా వుంటే రోగాలు వుండవు. భద్రత పెరుగుతుంది.

అందువల్లనే సుచిత్ర, హార్లిక్స్‌ని తన కుటుంబపు జీవనంలో ఒక భాగంగా చేసుకుంది. హార్లిక్స్ కాల పరీక్షకి నిలబడుతుందని ఆమెకు తెలుసు.

హార్లిక్స్...ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది యిది ఒక్కటే. అంత ఎక్కువగా పుష్టి యిచ్చేది హార్లిక్స్ ఒక్కటే. ఎందుచేతనంటే, ఇందులోని బలవర్ధకమైన, కల్తీ లేని పదార్థాలని అపూర్వమైన హార్లిక్స్ తయారీ పద్ధతి ద్వారా సమ్మిళితం చేయబడ్డాయి.

సుచిత్ర మోస్తరుగానే మీరు కూడా మీ కుటుంబానికి ప్రతి రోజు హార్లిక్స్ యివ్వండి. ముందు ముందు వారు ఎంతో ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

**"మీరు హార్లిక్స్‌ని నమ్మవచ్చు. నేను ఎల్లప్పుడు హార్లిక్స్‌నే సిఫార్సు చేస్తాను.**

అనారోగ్యంగా వున్నప్పుడు పుష్టిగా వుండటానికి హార్లిక్స్ పుచ్చుకోమని చెబుతాను. దీనికి కారణం చాలా స్పష్టమైందే. హార్లిక్స్ శుద్ధమైనది. కల్తీ వుండదు. మాంసకృత్తులు, కార్బోహైడ్రేట్లు, ఖనిజాలు యిందులో చక్కగా కలిసి వున్నాయి. ఇవన్నీ నిత్యం మంచి ఆరోగ్యంగా వుండటానికి సహకారి."





ఒక రూపాయి ఆదా చేయండి. 800 గ్రాం ఎకానమీ బాటిల్ కొనండి.




**దీనిలో ఆరోగ్యముంది.**

**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ ఒక రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు.

(Hx-4181 Tel.)

ప్రవీణకోసం ఆత్రుతగా ఫోనులో పదేపదే అడగటంచేత మర్నాడు ఉదయాన్నే ప్రవీణ తన యిల్లు చేరుకుంది

ప్రకాశ్ బాబుని అరెస్టు చేశారు. అనుమానం కలిగించడానికే ప్రకాష్‌బాబు అలా చేశాడని నిర్ధారణ అయింది ప్రవీణద్వారా; ప్రవీణ ప్రకాష్‌ని విడుదలచేయించే ప్రయత్నం చేసి కృతకృత్యురాలైంది ప్రకాశ్ తలెత్తి నడవలేకపోయాడు. అప్పటికప్పుడు కలకత్తాకు ప్రయాణమై వెళ్ళిపోయాడు ఆంధ్రదేశం మొహంకూడా చూడలేదు ప్రకాశ్‌బాబు

భాస్కర్‌బాబు అమెరికాలో భారతీయ కళాకారుడుగా మన్నన లందుకుంటున్నట్టు వార్తలు వచ్చాయి మదాసుకు.

ఎదురుచూసే శారద కళ్ళల్లోంచి వన్నీటి జల్లు కురిసింది. స్వాతిజల్లుకు ముత్యపు చిప్పలా ఎదురుచూసోంది ప్రవీణ భాస్కర్ రాకకు

## 20

అమెరికా నుంచి భాస్కర్ రాగానే ఒక సన్మానసభ జరుగుతుంది ఫిలిం జర్నలిస్టుల ఆధ్వర్యంలో

భాస్కర్ వచ్చేరోజు ఆసన్నమైంది. ఆరోజు మదాసు విమానాశ్రయంలో ఇసుక వేస్తే రాలనట్టున్నారు ప్రజ.

విమానం నుంచి ఆంధ్రుల అభిమాన హీరో నిచ్చెనమీద నుంచి దివినుండి భువికి అన్నట్టు మందహాసంతో దిగివస్తుంటే చుట్టూ హర్షధ్వానాలు చెలరేగాయి.

మెడలో పూలదండలతో నవ్వుతూ, చేయి వూపుతూ తన అభిమానులను కళ్ళతో పలకరించేడు.

విలేఖరుల అభినందనల మధ్య ప్రశ్నల వర్షం మధ్యనుంచి నడుచుకుంటూ కారు చేరాడు. అగ్రనటుడని అశేష ప్రజానీకం ప్రశంస లందుకుంటున్న భాస్కర్.

భాస్కర్ కోసం కారుతో డ్రైవరు ఎదురు చూస్తున్నాడు. భాస్కర్ బాబు యింటికిగాక, లాడ్జి పేరుచెప్పి తీసుకు పొమ్మని చెప్పేసరికి డ్రైవర్ తెల్లబోయాడు.

ఎట్లాగో నోరు పెగుల్చుకుని "అమ్మగారు, చినబాబుగారు మీకోసం ఎదురు చూస్తున్నారు సార్!" అన్నాడు.

"డ్రైవర్! నాకు తెలుసు. నేను చెప్పిన చోటికి పోనియ్యి ప్రస్తుతం" భాస్కర్ గంభీరత చూసి, చేసేదిలేక కారు పోనిచ్చాడు

## హీ రో

(9 వ పేజీ తరువాయి)

డ్రైవరు జనానికి వింతగొలిపింది సంఘటన. గుంపులుఏర్పడ్డాయి విశాలమైన రోడ్డుపైన.

డ్రైవర్‌చేత శారదకు, ప్రవీణకు ఇవ్వమంటూ రెండు ఎన్వలోప్ కవర్లు యిచ్చేడు.

* * *

ప్రవీణ చదువుకుంది.

ప్రవీణా!

శారదకు ఇలాటి ఉత్తరమే పంపుతున్నాను మీ ఇద్దరి హామీ నాకు చేరేవరకూ నేను ఈ లాడ్జిలోనే వుంటాను. నన్ను నీవు (మీరు అని సంబోధించనందుకు క్షమించు) నీ సాటి నటుడిగా గౌరవించు అంతకంటే ఏమీ చెప్పలేకపోతున్నాను నీవు నా నుంచి ఏమీ ఆశించకూడదు. ఆశించితే నేను నటజీవితానికి స్వస్తి చెపుతాను. నువ్వు ఈ లాడ్జికి స్వయంగా వచ్చినట్లయితే నేను నమ్మగలను.

ఆశీస్సులు
భాస్కర్.

* * *

ప్రియమైన శారదా!

ఈ ఉత్తరంచూసి నీభర్త నిన్ను అవమానిస్తున్నాడని ఆవేశపడతావు. నువ్వేమను



"ఫ్యాన్స్ లేకపోతె మానె – కనీసం ఈ చెమట తుడుచుకునేందుకు బ్లాటింగ్ పేపర్లయినా సప్లయి చేయించండి సార్..."

కున్నా ఫరవాలేదు ఇప్పుడు నేను ఒకే లక్ష్యంతో వున్నాను. నీకు నటుడిగా కీర్తి ప్రతిష్ఠలు తెచ్చుకునే భర్త కావాలో గౌరవప్రదంగా నీతో మామూలుగా సామాన్య జీవితం పంచుకునే భర్త కావాలో ఇది చదివిన వెంటనే తేల్చుకోవాలి నువ్వు - తొందరగా ఇక ఎక్కువ అవకాశం లేదు. తేల్చుకున్న వెంటనే లాడ్జికి కారులో రావల్సిందిగా కోరుతున్నాను. చి. బాబుని తీసుకొని రావద్దు.

నీ
భాస్కర్

శారదకు అయోమయ మనిపించింది. పూర్తిగా అర్థంచేసుకోడానికి కొన్ని నిముషాలు పట్టింది,

* * *

కొత్త వార్తల కోసం - ముఖ్యంగా సినిమా పత్రికలవారు కాచుకున్నారు ఆఫీసులో న్యూ బయటా.

కాలింగ్ బెల్ మోగింది.

"యస్. కమిన్." అన్నాడు టేబిల్‌వద్ద ఏదో రాసుకుంటున్న భాస్కర్‌బాబు.

"సినీ నటి ప్రవీణగారు వచ్చార్ సార్! మిమ్మల్ని చూడాలంటున్నారు."

తలుపు తెరుచుకుంది. భాస్కర్ నిలబడి వున్నాడు ఎదురుచూస్తూ. కన్నీరు కార్చిన దేవతలా తలుపు దగ్గర ప్రత్యక్షమైన ప్రవీణ మెల్లగా తల ఎత్తి భాస్కర్ కళ్ళల్లోకి చూసింది. ఆమె పెదవులు వణకసాగాయి,

ఒక క్షణం అలాచూసి భాస్కర్ రెండు చేతులూ చాచేడు. ప్రవీణ తన్నుతాను నమ్మలేక పోయింది విడిచిన బాణంలా వచ్చి ఆ చేతుల్లో వాలిపోయింది ఇరువురూ రెండు నిముషాలు అలాగే ఒకరినొకరు విడవలేక వాస్తవిక జగత్తు సంగతి మరచిపోయారు.

భాస్కర్ ప్రవీణ కన్నీరు తుడిచాడు. ప్రవీణ అప్పుడే మేల్కొన్న దానిలా చప్పున భాస్కర్ చేతులు తప్పించుకొని దూరంగా నిలబడింది.

"నన్ను క్షమించు ప్రవీణా! నీవు కోరిన జీవితం నీకు ఇవ్వలేని స్థితిలో వున్నాను. భార్య జీవించివుండగా, మరో వివాహంతో ఆమెను నొప్పించే విధానం – నా ఆశయానికే విరుద్ధం. ఇంకోరకంగా చెప్పాలంటే ఒక భర్తకు ఒకేభార్య వుండాలనే సిద్ధాంతాన్ని మనసారా నమ్మాను అని చెప్పాలి."

"ఫరవాలేదు నన్నుమీరు తెలుసుకున్నారు.



రుచికరమైన, పుష్టికరమైన
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు
BRITANNIA
Glaxo
BISCUITS
R
I
T
A
N
N
I
A
పెరిగే పాపాయిలకు
రుచివంతమైన తోడు
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు మరీ అంత ప్రత్యేకమైన రుచి గలిగి ఉండటానికి ఏమిటి కారణం ? వాటిలో గల సమృద్ధినిచ్చే, సంపూర్ణమైన పుష్టినిచ్చే లక్షణాలే. పిల్లలకు యివి యిష్టం, పెరుగుతారు ఎంతో బాగా వాటితో. బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు ఎదిగే మీ పిల్లలకు ఎంతో మంచివి.
బ్రిటానియా
బిస్కట్లు అత్యుత్తమమైనవి

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

అడిగిన ప్రశ్నలనే అడగక పోవటం నాకు చాలా సహాయం చేసినట్లు అవుతుందనీ, మీకు పోస్టు ఖర్చు దండగ కాదనీ, అసలే 'న్యూస్‌ప్రింట్' కొరత వల్ల కురుచ చేయబడిన ఈ శీర్షిక, వ్రాసినవాటితోనే నింపితే కొత్త రకం ప్రశ్నలకు తావుండదనీ ఈ విషయంలో నాతో సహకరించవలసిందనీ మీకు మాత్రమే గాక, దీని మూలంగా ఈ శీర్షిక పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

**బి. ఎ. ఆర్. — విజయనగరం.**

మా అబ్బాయికి 8 సం. లు. కనురెప్పలమొదళ్లలో ఏవో గుడ్లు కన్పించాయి. ఇవి పేను గుడ్లేమోనని తలలో చూస్తే తల వెంట్రుకల మొదళ్లలో చిన్న పురుగులు చర్మం రంగులో అతుక్కుపోయి కన్పించాయి. ఇవి ఏమిటి? వీటిని నిర్మూలించటానికి ఏమి చెయ్యాలి?

"లోరెక్సేన్ లిక్విడ్" నాలుగు ఔన్సులు కొని తగు మాత్రం చేతిలో తల వెంట్రుకల కుదుళ్ళకు అంటేటట్టుగా రాత్రి పూట తల భాగం అంతటా రాసి, మర్నాడు సీకాయగాని, కుంకుడు రసంతోగాని తల రుద్దాలి. ఇలా మూడు రాత్రులు వరుసగా చేస్తే పూర్తిగా తగ్గుతుంది. కాని మరలా రాకుండా జాగ్రత్త పడటానికి, ఈ లక్షణం ఉన్నవారు వాడే ప్రక్క బట్టలు, దిండు గలేబులు వేడి నీళ్ళలో ఉడికించి వాడటం, దువ్వెన ఈ మందు వాడే సమయంలో వాడక పోవటం విధిగా చేయాలి.

కుటుంబంలో ఇతర సభ్యులకి ఉన్నప్పుడు వారు కూడా విధిగా ఈ మందు పై క్రమంలో వాడవలసి ఉంటుంది.

**ఎమ్. ఆర్. — మదనపల్లి.**

నా వయస్సు 18 సం. లు 2 సం. ల నుండి తలలో చుండ్రు వున్నది. వెంట్రుకలు ఎక్కువగా ఊడి పోవుచున్నవి. దీనికి ఏమి వాడాలి ?

తలలో చుండ్రు గురించి ఇదివరకే చాలాసార్లు వ్రాసినట్లు గుర్తు.

**పి. పి. — ఒరిస్సా.**

మా అమ్మగారికి 9 సం. ల క్రిందట ప్రసవము ముందు శరీరంలో నెత్తురంతా పోయినది. ఆపరేషన్ చేసి పాపను తీశారు. గర్భ సంచీ మడిచి కుట్టినారు. తర్వాత మరలా 1 సం. క్రితం మరలా వంట్లో రక్తమంతా పోయినది. గర్భ సంచీ తీసి వేసినారు. దానితో కళ్లు సరిగ్గా కనపడకుండావున్నవి హోమియోపతి మందులు వాడితే పై చూపు కన్పిస్తోంది. క్రింద చూపు ప్రక్కల కన్పించుట లేదు.

మీ అమ్మగారికి కళ్లు సరిగా కనబడకపోవటానికి జరిగిన ఆపరేషన్‌కి సంబంధం లేదు. గర్భ సంచీ తీసి వేయటం అనేది వయస్సు దాదాపు మధ్య వయస్సు దాటటాన్ని సూచిస్తున్నది. కాలగతిలో సహజంగాఏర్పడేచూపుమందగించటంవల్ల మీ అమ్మగారి దృష్టి కొద్దిగా మందగించి ఉంటుందనే నా అభిప్రాయం. కానీ విపరీతంగా రక్తస్రావం వల్ల జరగదనిచెప్పటానికి వీల్లేదు. కంటి వైద్యుల చేత పరీక్ష చేయించి కండ్లజోడు వాడితే చూపు మామూలుగా కనపడుతుంది.

**బి. ఎల్. — అనకాపల్లి**

నా వయస్సు 22 సం.లు నాకు ముగ్గురు పిల్లలు. మళ్ళీ ఇప్పుడు 8 వ నెల గర్భవతిని "బ్లడ్‌ప్రెషర్" ఎక్కువగా ఉందన్నారు. కాళ్ళు, చేతులులాగటం, నీరసంగాను ఉన్నది. కేన్సరేమో అని అనుమానంగా ఉంది.....

ఇలా జరుగటాన్ని "ప్రీఎక్లాంప్టిక్ టాక్సీమియా అవ్ ప్రెగ్నన్సీ" అంటారు. కాళ్లు వాయటం, రక్తపుపోటు అధికం కావటం, మూత్రంలో "ఆల్బుమిన్" ఉండటం ఈ రోగ లక్షణాలు. వీటికై ఆహారంలో ఉప్పు తగ్గించటం, రక్తపుపోటు తగ్గటానికి మందులువాడటం చాలా అవశ్యం. "కేన్సర్"అనే పదాన్ని ప్రతి రోగానికి జోడించడం వృధామానసిక ఆందోళన మాత్రమే తెలియ జేస్తుంది. ●

---

## హీరో

నాకంతే చాలు. తెరమీద మీ ప్రేమికురాల్నిగా, భార్యగా శాశ్వతంగా వుండిపోతాను. నాకీ తృప్తి చాలు."

"థాంక్స్ ప్రవీణా !" భాస్కర్ ప్రేమగా చూసిన చూపు ప్రవీణ మనసంతా నిండి పోయింది.

ప్రవీణ వెయ్యిజన్మలకైనా అదే కోరుకుంటుంది.

శారద వచ్చినట్టు తెలిసి ప్రవీణ తడబడింది.

భాస్కర్ కళ్లతోనే భయపడవద్దని వారించాడు.

శారద తలుపు తెరుచుకొని లోనికి వచ్చింది. సిగకు ఒకపక్కగా అమర్చిన గులాబీ ఆమె వదనంలాగే అలసటతో వసివాడినట్లుంది. విరదనం మరింత కందినట్లుంది. రూపుదాల్చిన ఆవేదనలా శారద ఒక్కసారి భాస్కర్ వంక చూసింది.పరిసరాలు కూడా గమనించకుండా పరుగునవచ్చి, అతని పాదాలను చుట్టుకోబోయింది.

సగంలోనే భాస్కర్ ఆమెను అడ్డగించి లేవనెత్తేడు.

అతని ఎదమీద కన్నీరు కారుస్తూ "ఏవండీ నేనెప్పుడూ మీరు గొప్ప నటులు కావాలనే కోరుతాను. నన్ను మీరర్థం చేసుకోలేదు కనుకనే అలా వ్రాసేరు. ఇంటా బయటా మీరు మంచివారని పించుకోవాలని నేను తపించడంలో ఏమైనాపొరపాటుంటే నన్ను క్షమించండి. మీ దారికి అడ్డు రానే రానిక" అంటూ చలించిపోతున్న శారదను ఓదార్చడం కష్టమే అయింది.

"శారూ ! నువ్వు కోరుకున్న బుద్ధిమంతుడుగా వుండాలనే నా ఆకాంక్ష కూడా. అందుకే ఒకనాడు ప్రవీణ నన్ను కోరిన కోరిక తీర్చలేక పోయాను. అమెరికాకు పారిపోయాను."

అప్పటికి శారద ప్రవీణను చూసింది.

ప్రవీణ బెదురుగా శారద వంకకు కనులెత్తింది.

శారద ప్రవీణను సమీపించి, ఆమె చేయందుకొని మృదువుగా నొక్కింది. "ప్రవీణ గారూ! తెలుసుకోకుండా మిమ్మల్ని చాలా బాధించాను. భాస్కర్ మిమ్మల్ని స్వీకరిస్తే నాకే అభ్యంతరం లేదు. మీ మంచితనంతో ఆయన ప్రేమాభిమానాలు పొందగలిగారు ప్రవీణా !"

"అక్కా! ఇప్పుడు భాస్కర్‌బాబు నన్ను భార్యగా స్వీకరిస్తానన్నా నేను ఒప్పుకోను. తెలివితక్కువగా ఏమో కోరి మీకూ, భాస్కర్ గారికీ మధ్య కలతలు రేపిన నేరానికి మీరు నన్ను మనస్ఫూర్తిగా క్షమించండి. అదే పదివేలు. అయినా తెరమీద అతని పక్కన నటించే అదృష్టం చాలు నాకు ఈజన్మలో"

ప్రవీణ కంఠం జీరవోయింది.

శారదలో అవ్యక్త భావాలేవో కదిలి కళ్లు సజలమైనాయి. ప్రవీణ భుజాలు ఒకచేతో చుట్టి దగ్గరకు తీసుకుంది.

భాస్కర్ సంతోషంగా ఇద్దరినీ చూసాడు.

మరికొన్ని నిముషాల్లో శారదతోను, ప్రవీణ కొద్ది దూరంలో నిలబడి వుండగా టెర్రస్‌మీద నిలబడి తనకోసం ఎదురు చూస్తున్న ప్రజానీకానికి ప్రత్యక్ష దర్శనమిచ్చాడు చేయి వూపుతూ.

(అయిపోయింది)

# అలసట చెందితే-

చార్మినార్‌కి
మించింది లేదు




భారతదేశపు
అత్యధికంగా అమ్ముడుబోయే
సిగరెట్

66
పైసలకు*
10

చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

STATUTORY WARNING: CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

CMYS-164-234 TEL

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

### వి. కె. ఆర్. ఆర్. — సికింద్రాబాదు

మీ చీకటిదారి ఈ మధ్యనే చదివాను. ప్రేమలో కూడా అంత కక్ష వుంటుందా?

అంతకంటే వాస్తవ జీవితంలో యింకా దారుణంగా వుంటుందన్న విషయం-వార్తలు చదువుతూంటే తెలియడం లేదా? ఉదాత్తుడే హీరోగా అలవాటై పోయిన మీకు మోహన్‌పాత్ర యాంటీ హీరోగా తోచి వుంటుంది!

### ఎమ్. బిహెచ్. — సిరిసిల్ల

మీ రెంతగా ఆడది బానిసకాదూ అని అరచినా నేటి చిత్రాలలో ఆడది మగాడి చేతిలో కీలు బొమ్మగానే చిత్రిస్తున్నారు. దీని మీద మీ కామెంట్?

దీనిమీద కామెంటు అనవసరం. సినిమా పూర్తిగా పురుషుల వ్యాపారం. అందులో స్త్రీలు అవసరం మేరకే వాడుకోబడుతున్నారు. ఏ సినిమా నైనా చూడండి హీరోకి హీరోయిన్ వుండాలి కనుక ఒక నాయిక. హీరోకి రొమాన్సు, డాన్సు, నానా గోత్రాల మనో భావాలకీ ఓ ఆలంబన కావాలి కనుక ఒక ఆడదానిపాత్ర కావాలి. అందుకే ఎంత స్త్రీ పాత్రలకు ప్రాధాన్యం వున్న చిత్రమైనా అదీ పురుషునిచుట్టూ అల్లబడుతూంది! ఆడది ఏడిస్తే గాని డబ్బులు రావు గనుక గాని లేకపోతే ఇప్పుడు రాజబాబు, నాగభూషణం, సత్యనారాయణలూ, అల్లురామలింగయ్యలంటి హాస్యగాళ్ళూ ఆడవేషాలు వేసేస్తారు! వేసేసి వుందురు !!

### వి. ఎ. కె. — అనంతపూరు

పురుషులను దుయ్యపట్టడమే రచయిత్రుల ముఖ్యోద్దేశమా?

కాదు ఆడది కూడా మీలాంటి మనిషేనని చెప్పడమే ముఖ్యోద్దేశ్యం.

### పి. ఆర్. ఎస్. — కొత్తగూడెం

రంగనాయకమ్మ ఉత్తమ సృష్టి బలిపీఠం. స్త్రీలకు కనువిప్పు. నేటి సమాజంలో ఇటువంటి నవలలు చిత్రాలు విరివిగా రావాలి. హాట్సాఫ్ టు ముప్పాళ. ఏమంటారు?

నేనెప్పుడో "టోపీతీసి చేతపట్టి" రంగానాయకమ్మకి సలాం పెట్టాను. శ్రీనివాస్. షీ ఈజ్ గ్రేట్.

### టి. జె. ఎస్. — కోడూరు

ఈ పేరకులు ఎగతాళిగా ఉత్తరాలు రాసి మీ సున్నితమైన హృదయాన్ని గాయం చేస్తున్నారు అటువంటి వారికి మీరు జవాబులు రాయకండి.

ఎలా? రోడ్డు మీద నడిస్తే కారు కింద పడతామని నడవడం మానేయగలమా? శరీరం అంటూ వుంటే జబ్బు చేస్తుందేమోనని చంపుకుంటామా?.....అది పిరికితనం చస్తే శస్త్రమని నడవనూ నడవాలి. రోగం వస్తే వచ్చిందని అనుభవించనూ అనుభవించాలి. భయపడిపారుకో కూడదు.

### బి. ఎమ్. ఆర్. — విజయవాడ

కవి ఎవరు?

అక్షరాలు పేర్చేవాడూ, లల్లాయి పదాలతో పచ్చి శృంగారం గుప్పించేవాడూ, తనేం రాస్తే అదే కవిత్వం అనుకునే వాడూ, తన కవితతో ఏకీభవించని వారిని ఆడిపోసుకునేవాడూ, ఏకైక గేయంరాసి అంబారీ అధిరోహించాలని ఆత్రపడే వాడూ కాదు కవి. మనం వూహల్లో అనుకునేది మాటల్లో చెప్పగల్గినవాడూ, తన కవితతో మనం అనుకోనివిధంగా హృదయాన్ని స్పందింప చేయ కల్గినవాడూ, కంటతడి పెట్టించ కల్గిన వాడూ, ఆవేశం రేకెత్తించ కలవాడూ కవి.

కవికీ సంస్కర్తకీ తేడా ఏమిటి?

కవి మన వూహలని మాటల్లో పెట్టేవాడైతే మనం తెంచి అనుకునేది పైకి అనే వాడేసంస్కర్త.

### శంకర్ — కొవ్వూరు

మహిళా సంవత్సరంలో మహిళలకి కళ్ళునెత్తికొచ్చాయని మీ సమాధానాలుబట్టి తెలుస్తోంది.

కళ్ళు నెత్తి నుంటే నడవడం కష్టంఅని తెలియనంత మూర్ఖపుమూక కాదు ఆడజాతి! అందుకే ఆగీలు ఆదర్శాలు, కోరికలు ఆకాశాన్నంటేలావున్నా కాళ్ళెప్పుడూ నేల విడిచి వుండవు మాకు.




**కొత్త సీరియల్**

**'డాక్టర్ వనిత'**

**పై వారమే!**

### బి. డి. ఆర్. — వరంగల్లు

మీరు రచించిన పాశం చదివాను నాకు నచ్చలేదు. మీ రెంత వరకు చదివారు

నచ్చక పోవడానికీ నా చదువుకీ సంబంధం లేదు బాబూ, కాస్త ఎక్కువ చదివితే యింకాస్త బాగా రాసి వుందునన్న గ్యారంటీ లేదు కదు!

### వి. వి. ఆర్. — గూడూరు

మగవాడు ఎలాంటి స్త్రీ కావాలని కోరుకుంటాడు

కూడా నడవడానికి అందమైంది కావాలి! మాట్లాడ్డానికి సరదాగా వుండేది కావాలి! ఆలోచనలు చెప్పడానికి తెలివైంది కావాలి! పక్క పంచుకొందుకు భోగస్త్రీలాంటిది కావాలి! చితకతంతే నోరెత్తక పడివుండే మహా ఇల్లాలుకావాలి. ఎలా కుదురుతుంది?.....అందుకే కాబోలు ఎక్కువ శాతం మగవాళ్ళు "బైగమీ" బాగుంటుందని భావిస్తుంటారు!

### పద్మ — మండపేట

మన ప్రభుత్వం వర్ణాంతర వివాహం చేసుకున్నవారికి జాబ్ యిస్తారని నా ఫ్రెండు సలహా. ఉద్యోగ విషయంలో ప్రభుత్వం ఎంతవరకు సహకరిస్తుంది?

చూడుతల్లీ, ఉద్యోగంకోసం వర్ణాంతర వివాహం, డబ్బుకోసం సంతాన నిరోధన చేయించుకోవడం అర్థంలేని పని. ప్రేమ వర్ణాంతర వివాహానికి బాధ్యత, సంతాన నిరోధక చర్యలకి నాంది కావాలి.

### ప్రసాదు — సూళ్ళూరుపేట

ప్రక్క పేజీలో తన మొదటి కథ పడింది తెలిసీ ముందు సీరియల్ చదివే వోపిక కల వారెవరేనా వుంటారా?

ఎందుకుండరు? నేను సీరియల్ కూడాకాదు పత్రిక రాగానే ధర్మపథం చదువుతాను. తరువాత శ్రీనివాస్, తరువాత డాక్టర్ సలహాలు. అప్పుడే ప్రశ్నావళెంత వేశారని చూసుకుంటాను.

### ఎ. జె. ఎస్. — విశాఖపట్నం

కె. రా. గారూ ఈ మధ్య మీరు అధికార పక్షానికి బాకా వాయిస్తున్నారు. టాక్సు తగ్గిందని సంతోషంలో ఉన్నట్టున్నారు?

లేదు మంచి ఏ పక్షం తలపెట్టినా మెచ్చుకోవడం తప్పుకాదని నా నమ్మకం. అంతే. ●

# తన 'ప్రజల మనిషి'



80 కోట్ల ఎర్రచైనా ప్రజల ప్రియతమ నాయకుడు చరిత్రాత్మక "లాంగ్‌మార్చ్" (అక్టోబర్ 6, 1934) వీరుడు ఛెయిర్‌మన్ "మావో" – తన 82 వ ఏట – సెప్టెంబర్ 8 అర్ధరాత్రి దాటిన పది నిమిషాలకు– మహోజ్వలమైన సుదీర్ఘమైన జీవన యాత్రను ముగించాడు. దీంతో "లాంగ్‌మార్చ్" వీరత్రయ యుగం అంతమయింది. [జనవరి 8 న చౌ ఎన్ లై, జూలై 6 న చూ టెలు కాలధర్మం చెందారు]

మతాన్ని, దేవుణ్ణి కూడా అశేష చైనా ప్రజల గుండెల్లో నుంచి తొలగించి అక్కడ 'తిష్ట' వేసి, వీరపూజ లందిన "మావో సే టుంగ్"–1949 అక్టోబర్ 1 న యీ అతిప్రాచీనమైన బహు విస్తారమైన భూభాగాన్ని ఒక్క "జెండా" క్రిందకు తెచ్చి పాతికేళ్ల స్వల్పకాలంలో "రైతుగడ్డను అణుపారిశ్రామిక దేశంగా" చేసి పాలించాడు. 'తుపాకీ గొట్టాన్ని విప్లవసాధనంగా ప్రవచించిన యీ మహనీయుడు వర్తమాన చైనా రాజకీయ రంగంనుంచి తొలగిపోయాడు కానీ అతని స్మృతి, అతని సూక్తులు చైనా ప్రజల సామాజిక జీవన రంగంనుంచి యిప్పట్లో అంతరించక పోవచ్చును.

రష్యాను ధిక్కరించి, "మావో పార్టీ"కి అనూహ్యమైన ప్రతిపత్తిని అనతి కాలంలో సాధించిన యీ నవచైనా నిర్మాత 1971 'మేడే' తర్వాత అస్వస్థత కారణంగా తన ప్రజలకు దర్శనం యివ్వనేలేదు ... గత మూడు మాసాలుగా "విదేశీ అధినేతల పరామర్శకి కూడా అవకాశం యివ్వకుండా మంచాన తీసుకున్న "మావో" అంతిమ యాత్రలో అతని అనుయాయులు అనుచరులు, ప్రజలు మాత్రమే పాల్గొన్నారు. విదేశాల ప్రతినిధులకు 'పిలుపు' లేదు. 'రావద్దన్న' ప్రకటన కూడా వెలువర్చారు.

ఇటీవల లక్షలాది చైనీయులను పొట్టను బెట్టుకున్న చైనా భూకంపాల కన్నా యీ "మావో అస్తమయ" వార్త ప్రపంచ రాజకీయ రంగంలో సంచలనం కలిగించ వచ్చును ... "మహాయోధుడు, ప్రజాబాంధవుడు, కవి, కర్మోటకుడు, రాజకీయ వటవృక్షం, నవచైనా నిర్మాత" గా వాసికెక్కిన 'మావో' భౌతికంగా లేకపోయినా, రేపు డిసెంబర్ 26 న అతని 83 వ జన్మదినోత్సవాన్ని చైనా లోని ఆబాలగోపాలం జరుపుకుంటారు...'మావో' తరువాత 'చైనా' ఎట్లా వుంటుందన్న కుతూహలం– యావత్ ప్రపంచానికీ వున్నదిప్పుడు ... [★★★]

# హైదరాబాద్ నోట్ బుక్

### రెండు కళాప్రదర్శనలు

ఆగస్టు 21 నుండి నాలుగు రోజులపాటు కళాభవన్‌లో జరిగిన 5వ అఖిలభారత కేంద్రీయ విద్యాలయ బాల చిత్రకళా ప్రదర్శన బాలబాలికల సృజనాత్మక ప్రతిభకు మానవ మనస్తత్వ పరిశీలనా చాతురికి, నిష్కాపట్య, సంఘీభావ నిరాడంబర, స్వేచ్ఛా, సంతోషాది భావాల నిరాఘాటాభివ్యక్తికి, వర్ణ విన్యాస, వస్తు సమ్మేళన చాతురికి తార్కాణమనవచ్చు. ఆంధ్ర సబ్ ఏరియా కమాండర్ బ్రిగేడియర్ అవతార్‌సింగ్ ఈ ప్రదర్శనను ప్రారంభించారు. ప్రదర్శన లోని మొత్తం 214 చిత్రాలలో 59 చిత్రాలకు నగదు బహుమతులు, 36 చిత్రాలకు యోగ్యతా పత్రాలు లభించాయి. 5–7 వయోవర్గంలో పి. కొండలరాయుడు(గోల్కొండ)గౌతమ్ మొహంతి (ఒరిస్సా) ప్రథమ ద్వితీయ బహుమతులు, తక్కిన వయో విభాగాలలో బిందు (ఎర్నాకుళం), సుమన్ (కంచన్‌బాగ్), మాస్టర్ ఎం. ఒ. జాన్ (తిరుమలగిరి) ప్రథమ బహుమతులు, సుధారెడ్డి (గోల్కొండ) ఎస్. ఆర్. శ్రీనివాస్ (విశాఖపట్నం) జ్యోతిపటేల్ (గుజరాత్) ద్వితీయ బహుమతులు పొందారు. ప్రదర్శనలో కెల్లా ఉత్తమ చిత్రం బహుమతి ఎం. రామకృష్ణకు (గోల్కొండ) లభించింది. బంటవగరాల బాలబాలికలకే గాక, ఇతరులకు కూడా కనుల విందు చేసే ఈ ప్రదర్శనం ఏర్పాటు చేసిన గోల్కొండ కేంద్ర విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ జె. కె. గంగల్‌ను, ఆ విద్యాలయం చిత్రకళోపాధ్యాయుడు శ్రీ బి. ఎ. రెడ్డిని అభినందిస్తున్నాము.

శ్రీ రెడ్డిని గురించి వెం క్రితం పాఠకులు చదివారు.

రెండవది శ్రీ ఎం. గోపాల్‌రెడ్డి శిల్ప ప్రదర్శనం. శ్రీ రెడ్డి వరంగల్ జిల్లా దేవరుప్పల గ్రామ వాస్తవ్యులు. 32 సంవత్సరాల యువకులు. 1966లో పట్టభద్రులైన తరువాత, ఎనిమిదేళ్ల పాటు ఉపాధ్యాయులుగా పనిచేశారు. నాణాలు సేకరించడం, పురాతత్వ పరిశోధన అభిమాన విషయాలు. దారు శిల్పంలో నిపుణులు. మొద్దులు, వేళ్ళు ఎన్నిటినో మనం చూస్తున్నాము. వాటి ఆకారం విచిత్రంగా ఉంటుంది. వాటిని అకు డికక్కు డే శిల్పాలుగా తీర్చి, ఆయా రూపాలలోనే అందాలు చిందించడం ఈయన విశిష్టత. ఆగస్టు 25 నుండి 29 వరకు కళాభవన్‌లో ఈయన జరిపిన ప్రదర్శనంలో 43 శిల్పాలు ఉన్నాయి. ఇవన్నీ వివిధ సహజ సుందర రూపాలు సంతరించుకున్న మొద్దులు, కొమ్మలు, విరిగిన పలకలు, ఎండిన తీగెలు, కుంకుడు వేళ్ళు,ఊడుగు మొద్దులు, మర్రి వూడలు టేకు మొద్దులు రావి వేళ్ళు, వేప వేళ్ళు, తంగేడు అడుగులు, వావిలి వేళ్ళు మొదలైనవి. ఈ శిల్పకళలో ఈ యువకుడు విశ్వఖ్యాతి పొందుగాక!

### రాష్ట్ర పురాతత్వశాఖ సర్వేక్షణం

రాష్ట్ర పురాతత్వ మ్యూజియం శాఖ రాష్ట్రములో పల్లెపల్లెన చరిత్రక సాంస్కృతిక ఆధారాలు కనుగొనడానికి సర్వేక్షణం ప్రారంభించింది. ఈ సర్వేక్షణంలో భాగం నగరానికి 20 మైళ్ల దూరంలో ఉన్న కేసరగుట్ట ప్రాంతంలో జరిగిన త్రవ్వకాలు. ఈ త్రవ్వకాలలో లభించిన విష్ణుకుండినుల నాణాలు మొదలైనవాటిని బట్టి ఇది విష్ణుకుండినుల రాజధాని కావచ్చునని చారిత్రికులు భావిస్తున్నారు. విష్ణుకుండినులు కృష్ణ దాటి ఇవతల అడుగు పెట్టిన వారు కారనే వాదం ఉంది. కాని, కొత్త పరిశోధనల వల్ల చరిత్ర తారుమారవుతున్నది. ఏమో ఏ త్రవ్వకంలో ఏమి బయల్పడుతుందో? ఒకప్పుడు జన భీకరంగా ఉన్న రజాకార ప్రధాన

కేంద్రం దారుస్సలాం ఆవరణలో మంత్రి శ్రీ అంజయ్య వినాయక చవితినాడు వినాయక విగ్రహం ప్రతిష్ఠించలేదా! చరిత్ర గతిని ఎవరు చెప్పగలరు, గుర్తించగలరు.

### విదేశాంధ్ర ప్రచురణలు

ఇదివరకు తెలుగు పుస్తకాలు ఒక్కమాస్కో నుంచి ప్రచురితం కావడం చూస్తున్నాము. కాని ఆ కృషి సంస్థలద్వారా జరుగుతున్నట్టిది. ఇప్పుడు, డాక్టర్ కృష్ణమూర్తి అనే బక్క పలుచని ఆంగ్ల భాషోపాధ్యాయుడు విదేశాంధ్ర ప్రచురణలు అనే పేర సంస్థను స్థాపించి తొలి పుస్తకంగా శ్రీ పురిపండా అప్పలస్వామి కవితా సంకలనం "పురిపండా" ప్రచురించారు. దీని ఆవిష్కరణ కళాభవన్‌లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ ఎం. ఆర్. అప్పారావు అధ్యక్షతన సెప్టెంబర్ 1 వ తేదీన జరిగింది. విద్యాశాఖామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు, శ్రీయుతులు వార్ల వెంకటేశ్వర

## హైదరాబాద్ నోట్‌బుక్

రావు, రాయప్రోలు సుబ్బారావు పి.ఎస్.ఆర్.అప్పారావు, దేవులపల్లి రామానుజరావు, డాక్టర్ కృష్ణమూర్తి శక్తి సామర్థ్యాలను ప్రశంసించారు. ఇండియా లైబ్రరీలోని తెలుగు రికార్డులు సేకరించి ప్రచురించాలని కోరారు. డాక్టర్ ఆదపా రామకృష్ణరావు పులిపంజాలోని గదబకన్నె, అసిల పతాకం మొదలైన శీర్షికల కవితా ఖండికలు చదివి వివరించారు. డాక్టర్ కృష్ణమూర్తి తమ ప్రచురణల పథకాన్ని వివరించారు. అమరకల్పద్రుమం వంటి పదకోశాలు ప్రచురిస్తున్నారు. లేఖా సాహిత్యం, స్థల పురాణాలు చాల అవసరమన్నారు. ఇంగ్లండు విశ్వవిద్యాలయాలలో తెలుగు ఒక పాఠ్య విషయంగా పెట్టించడానికి ప్రయత్నిస్తున్నారు

### 76వ స్థాపన దినోత్సవం

తెలంగాణాలో తెలుగుభాషా సంస్కృతుల వికాసానికి ఆటపట్టయిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం 76వ స్థాపనోత్సవం సెప్టెంబర్ మొదటితేదీ ప్రఖ్యాత విద్వత్కవి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి అధ్యక్షతన జరిగింది. అధ్యక్ష భాషణంలో శ్రీ శాస్త్రి, డాక్టర్ బిరుదు రాజు రామరాజు, గ్రంథాలయ కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు గ్రంథాలయ చరిత్ర, సేవ వివరించారు. పిదప జరిగిన కవి సమ్మేళనంలో శ్రీయుతులు కేశవపంతుల నరసింహశాస్త్రి, పి. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రి, తిరుమల శ్రీనివాసాచార్య, ఎస్. కిషన్‌రావు, ముకురాల రామిరెడ్డి, వి.మధుసూదనరావు, నీలాజంగయ్య, తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి, నాయని కృష్ణకుమారి జ్యోతిర్మయి, లక్ష్మీరమణ స్వీయకవితాగానం చేశారు.

### శ్రీమతి లక్ష్మి రఘురామయ్య

శ్రీమతి లక్ష్మీరఘురామయ్య అఖిలభారత మహిళా మహాసభకు మూడవసారి అధ్యక్షురాలుగా ఎన్నికైన సందర్భంగా సెప్టెంబర్ 4వ తేదీన రవీంద్ర భారతిలో జరిగిన సన్మాన సభకు అధ్యక్షత వహించిన రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ ఆమెను ప్రశంసిస్తూ, ఆమెను ఆదర్శంగా గ్రహించి భారత మహిళలు అభ్యున్నతికి కృషి చేయాలని కోరారు. స్త్రీలలోని నిరక్షరాస్యతను నిర్మూలించాలని గవర్నర్ శ్రీ భండారే అన్నారు. ప్రత్యేక సంచికను రాష్ట్రపతి సతి శ్రీమతి అబిదా బేగం ఆవిష్కరించారు. శ్రీ టి. ఎస్. కృష్ణానంద రచించిన లక్ష్మీరఘురాం జీవన స్రవంతిని న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ఆవిష్కరించారు. సన్మాన సంఘం కన్వీనర్ శ్రీ పిరమాచనేని వెంకటనారాయణ ప్రారంభంలో స్వాగతం చెప్పారు.

### ఉపశ్రుతి:

"ఫలానా వారి అస్తమయంతో దేశానికి నష్టమైంది, సాహిత్యం గోడుపోయింది. అంటూ పెద్దలు ప్రసంగిస్తారే, నిజమేనా" అని ప్రశ్నించాడు ఒక సాహిత్య విద్యార్థి నన్ను. నేను ఆలోచిస్తున్నాను. నాతో వున్న ఒక వృద్ధ స్వాతంత్ర్య యోధుడు "మరణించినవారికి, వారి ఆశ్రితులకు నష్టం. నీటి బుడగ ఉంటే ఎంత? పోతే ఎంత?" అన్నారు. —తిరుమల రామచంద్ర

## నిషాలో విషాదం

ఎసిరిక చెందిన వో గ్రామంలో రహస్యంగా నిషామందు తయారుచేసి వో వ్యాపార తన తయారీ తానే శాంపిల్ కన్నా ఎక్కువగా రుచిచూసి దాని ప్రభావం ఎక్కువయినందువల్ల యింటివరండాలో పడుకున్నాడట. రాత్రి ఏ సినిమా నుంచో ఇంటికి వచ్చిన కూతుర్ని చూసి పరస్త్రీ అనుకుని బలాత్కరించ బోయేసరికి తలుపు తీసి అతని భార్య బయటికి వచ్చి అడ్డుకుందట. అతడామెను తోసేసి, రెట్టింపు ఉత్సాహంతో కూతురుమీద పడేసరికి అతనిభార్య లివ్వున వెళ్ళి గొడ్డలితెచ్చి భర్తను నరికి పారేసిందట. కోర్టు వారు విచారించి, ఆమె చేసిన పని తప్పుకాదని నిర్ణయించారట.

### తపాలా పెట్టెలో పాము !

చెంగల్పట్టుకు చెందిన వో పాముకు సరదాపుట్టి, ఏం జరుగు తుందో చూదామని వో పోస్టుబాక్సులో దూరి కూర్చుందట. ఆ పెట్టెలోంచి ఉత్తరాలు తీయాలనే సత్సంకల్పంతో లోపల చెయిపెట్టిన పోస్టుమాన్ వో గావుకేక వేసి కొంచెం నేలమీంచ ఎగిరి, స్థిరపడ్డాడట. ఆ చర్యకు పోస్టైన సెలు గురూ విశేషమేమిటని చూస్తే తపాలపెట్టెలోని పాము వారిన్జూసి జాలిగా నవ్విందట. ఆ రోజు ఆడికృత్తిక అయినందువల్ల ఆ పాముకు వారుప్రాణ భిక్ష పెట్టారట!

### శనగలు చేసేమేలు !

మీ గుండెకు జబ్బుందా! అది చాలా డేంజరు. ఎప్పుడో అది మీ కొంప ముంచు తుంది. ఇది అందరికీ తెలుసుగానీ, దాన్నుంచి తప్పించుకునేదే డాక్టర్లకూడా అంతుచిక్కుతున్నట్లు లేదు. నానిన, మొలకలు వచ్చిన శనగలను తింటే యీ జబ్బురాదని డాక్టర్ మాథూర్‌గారన్నారట. ట్రయి చెయ్యండి. కాస్ట్లీకాదు కదా,

### బుద్ధిమంతుల పనితనం !

తిరువెళ్ళ కొచ్చిన్ మెయిలు కోయంబత్తూరు స్టేషనులో ఆగాక వో యిద్దరు కుర్రాళ్ళు బహు బుద్ధి మంతులుగా దిగారట. వారి బుద్ధిమంతతనానికి ఆ నమ్రమైన నడకకు ఆశ్చర్యపడి పోలీసులు వారిని అభినందించబోయి, అట్టే వుంచి పోయారట. ఇద్దరి వీపుల మీద కలసి 58 వేలు విలువచేసే 1078 గ్రాముల బంగారం వున్నదట. ఆ కుర్రాళ్ళ పేరులు మోహన్, వెంకటేశ్వరన్ అట !

### ఆటలో పోయిన ప్రాణం

మద్రాసులో సెయింట్ బీడ్స్‌స్కూలు మైదానంలో క్రికెట్టు ఆటలు జరుగు తున్నాయట. ఆ ఆటల్లో పాల్గొన్న కృష్ణమూర్తి అనే అతను ఆడుతూ ఆడుతూ తప్పున క్రిందపడి చనిపోయాడట. ఇది ఎందుకు, ఎలా సంభవించిందోనని పోలీసులు ఆయన శవాన్ని పోస్టు మార్టమ్‌కు పంపారట !

### లాటరీ తెచ్చిన ముప్పు !

తమిళనాడు వాళప్పాడి అనే గ్రామానికి చెందిన 25 ఏళ్ళ వీరాసామికి తమిళనాడు లాటరీలో లక్ష రూపాయలు వచ్చిందట. దాంతో అతను మీనాక్షి అనే 27 ఏళ్ళ అమ్మాయిని, 25 ఏళ్ళ అక్కమ్మను 28 ఏళ్ళ కన్నమ్మనూ ప్రియురాళ్ళుగా ఎంచుకుని వారిని యింటికి తెచ్చుకుని, తన భార్య చింతామణితోపాటు వారితోనూ కాపురం ప్రారంభించాడట. ఆ ప్రియురాళ్ళలో అక్కమ్మ అనే ఆమె వేరే వో యువకునితో రహస్య ప్రేమాయణం ప్రారంభించిందట. ఈ సంగతి తెలిసిన వీరాసామి ఆమెను షికారుకని బయటకు తీసుకువెళ్ళి, అక్కడ రాళ్ళతో ఆమెనుకొట్టి చంపి, నూతిలో పారేసి తాను పరారై పోయాడట. పోలీసులు తననూ పట్టుకుంటారని, బ్రతికుంటే వారి బాధ తప్పదని తలచి, చివరికి తానూ మొన్న ఆత్మహత్య చేసుకున్నాడట.

### ఇల్లంటుకుని ముగ్గురి మృతి

కాంచీపురంలో డి. ఎం. కె. మాజీ మంత్రి అణ్ణామలై అనే ఆయనింట్లో అగ్నిప్రమాదం జరిగిందట. ఈ అగ్ని ప్రమాదంలో ఆయన కొడుకు పాతికేళ్ల సుకుమారన్, 45 ఏళ్ల బావమరిది జానకి రామన్ చిక్కుకున్నారట. సుకుమారన్ని రక్షించబోయిన అతని స్నేహితుడు 20 ఏళ్ల పసుపతి కూడా మంటల్లో చిక్కుకుని కాలిపోయాడట, అంతకూ యీ విపత్తు ఎలా సంభవించిందో తేలలేదట.

### అమెరికా జనాభా

అమెరికా జులై నాలుగో తేదీన తః రెండొందలో స్వతంత్ర దినోత్సవం జరుపుకున్న సందర్భంలో అక్కడి జనాభా 21,56,67,979 అట. ఈ సంఖ్య రెండొందలేళ్ళ కన్నా పాటు రెట్లు యీ నాటికను య్యిందట.

### అర్థం అనర్థాలకు మూలం

ఈ రోడ్డుకు చెందిన కొంగంపాలెంలో 35 ఏళ్ల తంగముత్తు అనే అతను తన చెల్లెలు పెళ్లికి తన భార్య వైపు బంధువుల దగ్గర్నుంచో ఆయిదొందలు అప్పు తీసుకున్నాడట. ఈ విషయం అతని భార్య రుక్మిణికి తెలిసి తన పుట్టింటవద్ద తన పరువుతీసినందుకు భర్తను దులిపేసిందట. తరువాత కూడా తంగముత్తు ఆ బాకీ తీర్చలేక పోయేసరికామె తన మంగళసూత్రాన్ని తాకట్టు పెట్టి బాకీ చెల్లించేసిందట. ఈ విషయంలో భార్యాభర్తలకు పోట్లాట వచ్చిందట, దాంతో మనస్సు విరిగిపోయిన రుక్మిణి కాఫీలో విషం కలిపి తన ఆరేళ్ల కూతురు కణ్ణమ్మకు, మూడేళ్ల కొడుకు బాలుసామికి చెరికాస్త పట్టించి, తానూ తాగేసిన కాస్సేపటికి ముగ్గురూ వాంతులు చేసుకుని, చనిపోయారట.

### టెలివిజన్ చూస్తే బుద్ధి మాంద్యం

టెలివిజన్ చూడగా చూడగా తెలివితేటలుసన్నగిలి, బుద్ధిమందగిస్తుందని, మందకొడులై పోతారని శాస్త్రవిజ్ఞాన వేత్తలంటూనే ఉన్నారు ఆస్ట్రేలియాకు చెందిన డాక్టర్ హెర్బర్ట్ అనే ఆయన తన సెక్రటరీ బుర్రమీద కొన్ని ప్రయోగాలు చేసి, టెలివిజను చూడడంవల్ల బుద్ధిమందగిస్తుందన్న విషయాన్ని పునరుద్ఘాటించారట. అయినా దేశంలో టెలివిజన్లకేం నష్టం — ఫలానా బ్రాండు సిగరెట్టు త్రాగుడు......... హెచ్చరిక: "సిగరెట్టు త్రాగడం ఆరోగ్యానికి హాని".... హవ్వా యిలాగైతే!






# వంటలు

## రవ్వ కేకు

కావలసినవస్తువులు : బొంబాయి రవ్వ — 2 కప్పులు, పంచదార—1కప్పు, బేకింగ్ పౌడర్ 1 టీస్పూన్, వెనీలా ఎసెన్సు ఐదారు చుక్కలు.

ముందుగా పైన చెప్పిన వస్తువులు ఒకగిన్నెలో పోసుకుని చక్కగా కలుపు కోవాలి. ఎసెన్సు వెనీలా బదులు మనకిష్టమయినది తీసుకో వచ్చును. కేకుపాత్రను తీసుకొని దానికి నెయ్యి రాసి బాగాకలిపిన మిశ్రమాన్ని అందులో పోయాలి. కేకు పాత్రల్ని వివిధ సైజుల్లో బజార్లో అమ్ముతారు. ఆ తర్వాత స్టౌమీద పెనం వుంచి దానిమీద ఇసుక పొయాలి. ఈ కేకుపాత్రను ఇసుకపై వుంచి పది హేను యిరవై నిమిషాలపాటు కాలనివ్వాలి.

— శ్రీమతి విజయా ప్రసాద్.

## బ్రెడ్ కట్లెట్

కావలసిన వస్తువులు: రొట్టె ఒకటి బంగాళ దుంపలు - అరకిలో. శనగపిండి – పావుకిలో, రెండు ఉల్లిపాయలు, నాలుగు లవంగాలు; జీలకర్ర, ఉప్పు తగినంతగా, కొన్ని పచ్చిమిరప కాయలు.

తయారుచేయు విధానం : ముందుగా బంగాళ దుంపలను ఉడకబెట్టి పైపెచ్చు తీసుకోవాలి. ఉల్లిపాయలు, లవంగాలు, జీలకర్ర పచ్చిమిర్చి వేసి మసాలా నూరుకోవాలి. బంగాళ దుంపలను మసాలా కొద్దిగా ఉప్పువేసి మెత్తగా ముద్ద చేసుకోవాలి. ఆ తర్వాత రొట్టెను త్రిభుజాకారపు ముక్కలుగా కోసుకోవాలి.

బంగాళా దుంపలు మసాలా ముద్దను కోసుకున్న బ్రెడ్ ముక్కలికి రెండు పక్కలా వొత్తుకొని, బజ్జీల పిండిలా కలుపుకున్న శనగ పిండిలో ముంచి డాల్డాలో వేయించు కోవాలి.

— వై సుజాత.

## సగ్గుబియ్యం పకోడీలు

పకోడీలు చాలామందికి యిష్టం కాని సగ్గుబియ్యంతో వాటిని చేస్తారంటే కొంచెం ఆశ్చర్యంగానే వుంటుంది వాటిని చేసి చూడండి. కావలసిన వస్తువులు సగ్గుబియ్యం పావు కేజీ, పెరుగుకాని చిక్కటి మజ్జిగకాని 1 కప్పు, పచ్చిమిరప కాయలు 8, అల్లం చిన్నముక్క, ఉల్లి పాయలు పెద్దవి 2, కొత్తిమీర కొంచెం, ఉప్పు తగుమాత్రం.

తయారుచేసే విధానం : రేపు పకోడీలు చేసుకొందామనుకొంటె ముందు రోజు రాత్రి గిన్నెలో పెరుగుపోసి సగ్గుబియ్యంవేసి నాన బెట్టాలి. మరుసటిరోజు ఉదయంగాని మధ్యాహ్నంగాని ఆ నానబెట్టినదానిలో అల్లం, పచ్చిమిరపకాయలు, పుల్లిపాయలు చిన్న చిన్న ముక్కలుగా తరుగుకొని ఆ ముద్దలో వేయాలి. అప్పుడే కొత్తిమీరకూడ వేయాలి. బాణలిలో నూనెపోసి స్టౌవ్‌మీద పెట్టాలి. నూనె బాగా వేడెక్కిన తరువాత ఆ ముద్దను చిన్న చిన్న పకోడీల కింద వేయాలి. వేగిన తరువాత వాటిని స్టీలు పళ్లెంలోనికి తీయాలి. చాలా రుచిగా ఉంటాయి.

— పులిమిరి పార్వతీదేవి.







పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్‌వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410 TL

## యువతరం

వైజాగ్‌లో బి. టెక్ ఫైనల్ చదువుకుంటున్న అల్లూరి రంగరాజుకి వోటు హక్కు వచ్చింది. "నువ్వు అల్లూరి సీతారామరాజు చుట్టానివా?" అంటే దూరపు బంధువంటాడట ఫ్రెండ్స్‌తో. కాని అలాంటి దేం లేదుట! ఈ యువకుడు కోరుకొండ సైనిక స్కూల్లో చదువుకున్నాడు. మెత్తగా మాట్లాడ్తాడు. జెనరల్ నాలెడ్జ్, క్విజ్, "ఎస్సే"లు వ్రాయటం లాంటి వాటిలో పాల్గొనటం సర్దా.



క్రమశిక్షణ అంటే యిష్టమే కాని సైనిక స్కూలు కోరుకొండనుంచి వాల్తేరుకి చెప్పకుండా రాత్రికి రాత్రి పోయి "మై ఫెయిర్ లేడీ" బైస్కోపు చూశాడట! వాళ్ళ హెడ్మాస్టర్ తగిన శిక్ష వేశారటలెండి.

అసలు వాళ్ళవూరు భద్రాచలం. వైజాగ్‌లో యెక్కువకాలం వుంటే బోరుకొడుతుందిట! "నాకు అభిమాననటులు లేరు. మన తెనుగు సినిమాలు చూస్తుంటే అవి ఫ్యాషన్ పరేడ్‌ల్లాగా, దుస్తుల అడ్వర్‌టయిజుమెంట్‌ల్లాగ కనపడుతున్నాయి అంటున్నాడు రంగరాజు. "ఫారిన్, ఫిలిమ్‌స్టఫ్" అంటే యిష్టం. మదర్‌థెరిసామీద భక్తివుంది. ఇంగ్లీష్ అమెరికన్ నవలలు చదువుతాడు. 'నెవిల్ షూట్'ని 'రాబిన్స్‌నీ' కూడా 'లైక్' చేస్తాడట? లైబరీకి పోయినా ఇంగ్లీషు పత్రికల మీదనే మనవాడి దండయాత్ర. మళ్ళీ మరో విచిత్రం 'టైమ్' 'న్యూస్‌వీక్' రెండూ యిష్టమే! ఈ అబ్బాయి సీదాసాదాగా మన దేశవాళీ సంప్రదాయసిద్ధమైన రూపురేఖలలో వున్నాడు గాని, సంగీతం కూడా విదేశీ సరుకే యిష్టమన్నాడు. ఓ తీరని కోరిక వుంది. భారతదేశం నుంచి ఐరోపా ఖండానికి "హిచ్ హైకింగ్" చేయాలనుంది అన్నాడు. సిగ్గు విడచి 'లిఫ్ట్' అడగటం ధైర్యంచేసి కార్లలో 'లిఫ్ట్' యివ్వటం యీ రెండూ, మన దేశంలో అలవాటులేని పన్లు. అంచేత రంగరాజులో ఏదో చెయాలన్న ఆరాటం ఎక్కడికో పోవాలన్న ఆవేదన బాగా చదివి ఫస్టుక్లాస్ తెచ్చుకుని, స్కాలర్‌షిప్ మీద ఏ విదేశయాత్రనో చేసి తిరుగుదలలో "హిచ్ హైకింగ్" చేస్తేకాని తీరదేమో. [ ★ ★ ★ ]



పోలాప్రగడ జనార్దనరావును 'జన్ని' అంటారందరూ. ఇటీవల ఎన్నోచోట్ల 'ముఖాభినయం' లేదా చేష్టానుకరణ ప్రదర్శనలు యెన్నో యిస్తూఉన్న యీ యువకుడు వుద్యోగరీత్యా హైద్రాబాద్‌లో వుంటూ ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘంలో మూడేళ్ళపాటు 'థియేటర్ ఆర్ట్స్' నేర్చుకొని డిప్లొమా తీసుకున్నాడు. చిన్ననాటి నుంచి నాటకాలలో పాల్గొంటున్న యీ 'జన్ని'కి ఎన్నో బహుమతులు లభించాయి. నాటకాలలోను ఆటలలోను అనుభవమున్న యితని 'మైమ్' ప్రదర్శనలు యీ మధ్య దేశంలో ప్రాచుర్యం పొందుతున్నాయి. [ ఒ. వి. ]

### గమనిక

"మినీ యింటర్‌వ్యూలు" అనేవి టపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యం కాదని మా యువ పాఠకులకు మనవి ... సం.

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన లందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం. —సం.




### అట్టమీద బొమ్మ

'వినాయక చవితి' పండక్కి వినాయకుడి ముఖచిత్రంతో వెలువడిన 3.9.76 పత్రిక మాకు ఓ మంచి "ప్రెజెంటేషన్' లా వుంది. ఆంధ్రసచిత్ర వారపత్రిక 70వ పుట్టిం రోజు పండక్కి మా శుభాకాంక్షలు.

అతి చిన్న సంఘటనతో ఎంచబడ్డ కథానికలు నాలుగు ఒకదానిని మించి మరొకటి అన్నట్టు ఉన్న ఉపోద్ఘాతాలు, కొటేషన్స్‌తో ఉంటాయనుకొన్న "సినిమాల్లో తెలుగుభాష" పై వ్యాసాలు అందుకు భిన్నంగా చక్కటి భాషతో చకచకగా చదివించేవిగ ఉన్నాయి.

జాతి యావత్తు 'సెల్యూట్' చేసే జాతీయ పతాక మహా శిల్పి వెంకయ్య (పింగళి) గార్ని తపాలా శాఖ వారు విద్యా పౌర్యప్రణాళికవారు కూడ విస్మరించడాన్ని గూర్చి 'సామాన్యుడి సణుగుడు'లో "ఆయన తెలుగు దేశస్థుడైన కారణంచేత కాబోలు" అన్న విరాజీ వ్యాఖ్యాలు తెలుగు వారిపై ప్రభుత్వానికి గల నిరాదరణని తెలియ చేస్తాయి.

కార్టూన్స్ కొద్దైనా గొప్పగా, పొట్టచెక్కలయ్యేలా ఉన్నాయి. సీరియల్స్, ఇతర శీర్షికలు అన్నీ చక్కగా ఉన్నాయి. 'ఆంధ్ర సచిత్రవారపత్రిక'పుట్టిన రోజు పండుక్కి మరొకమారు శుభాకాంక్షలు.

జె. సుబ్రహ్మణ్యం (ప్రొద్దుటూరు)

### చవితి సంచిక

ఈ మధ్య 'వినాయక చవితి' ప్రత్యేక సంచిక చదివాను ! ముఖ్యముగా 'విరుగుడు' కథానికలో టెక్నిక్ చాలా బావుంది హోటలు మేనేజర్లు కొందరు తెల్లవారితే చేసే 'పాపాలను' చక్కగా ఈ కథనికలో వివరించటం జరిగింది. అసమర్థులైనవారిని కాపీయర్ల క్రిందనో, మేనేజుమెంట్‌లోను ఉంచటం కాఫీఫలహార శాలలకు ముఖ్యంగా ఎంత ముప్పో.. ఈ కథలో పెద్దమనిషి వివరాలు చాలామంది కళ్ళు తెరిపిస్తుంది. అని నమ్ముతున్నాను

కొన్ని కాఫీఫలహారశాలలో వినయ విధేయతలు లేకుండా, సర్వర్లు తదితరులు ప్రవర్తిస్తూ వుంటారు టీలో పంచదార తక్కువయితే కేకలు పెట్టే కష్టమర్సు కనిపిస్తూ ఉంటారు. ఇలాంటివి జరగకుండా అరికట్టి, 'బిల్లు' సక్రమపద్ధతిలో తీసుకోవటానికి 'రాఘవయ్య' వంటి వాళ్ళు అవతరించాలి.

'స్ట్రిక్ట్' కథ కథలాగ కనిపించలేదు. ఎందుకంటే, కథ చివర 'కుక్కపిల్ల కోసం' ఒక గృహస్థుడు స్ట్రిక్ట్‌గా నటించి, కన్నపిల్లలపట్ల 'స్ట్రిక్ట్'గా వుండటంలేదని అతనిభార్య చెపితే ఎలా నమ్మాలి !?

బోరగిమహాంతి సుధాకరరావు (కాకినాడ)

* * *

27.8.76 తేదీ సంచిక పై ముఖచిత్రం చాలా బాగుంది. కథలలో "ఎవర్జన్సీవార్డు" నాకునచ్చింది. నిజంగా ఈ కథలో వలె పరూధునిల ఎంత మంది ఉన్నారో ? ఎంతమంది జీవితాలన కుటుంబాలను నాశనం చేస్తున్నారో అన్న ఆలోచన కలిగింది

దాస్యం సేనాధిపతి, (నిర్మల్)

### సీరియల్

9.7.76 ఆంధ్ర సచిత్రవారపత్రికలో మీరు గమనించినట్లయితే 'బాంధవ్యాలు' సీరియల్‌లోని కథానాయిక 'విజయ' తన బావ 'శ్రీధర్' జ్ఞాపకాల నించి దూరంగా పారిపోవడానికి ఎం. ఎ చదివేనిషతో ఆంధ్రాయూనివర్సిటీ వెళుతుంది.

అంతకు మునుపే 'శ్రీధర్' ఫారిన్ వెళ్ళిపోతాడు అతడక్కడ నాల్గు సంవత్సరాల ఉండాలనుకుంటు న్నట్లుగా తన తల్లికి ఉత్తరం వ్రాస్తాడు.

అమాట ప్రకారమే పార్టు టైం జాబ్ మెకానిక్‌గా గారేజీలో వర్కుచేసి తనకు సరిపోను సంపాదించుకుంటూ మూడు సంవత్సరాలు తన ట్రైనింగ్ పూర్తి చేసుకుంటాడు (16.7.76) అమ్మాయి చదువుకుంటోందని చదువు పూర్తి అయితేనేగాని వివాహం చెయ్యనని చెప్పేవాడు విజయ తండ్రిగంగాధరం. శ్రీధర్ ట్రైనింగ్ పూర్తి అయిన 2నెలకు మామయ్యకు ఉత్తరం వ్రాస్తే విజయా శ్రీధర్‌ల పెళ్ళికి ముహూర్తం పెట్టిస్తాడు గంగాధరం. అలా విజయా శ్రీధర్‌ల పెళ్ళి శ్రీధర్ ఫారిన్ వెళ్ళి, మూడు సంవత్సరాలు గడిపి తిరిగొచ్చాక, అవుతుంది. ఈ పెళ్ళి కాస్తా అయినాక, కొద్దినెలలు విజయా శ్రీధర్‌లు "కాపురంగాని కాపురం" చేస్తారు.

13.8.76 సంచికలో విజయ వస్ట్‌క్లాస్‌లో

---

వక్కలే ప్రధానంగా ఎగుమతి అవుతున్నాయి. గుండ ముక్కల రూపాలలో ఎగుమతులు తక్కువ. వీటి ఎగుమతి ద్వారా రూ. 3.34 మిలియన్ల విదేశమారక ద్రవ్యం లభించింది. ఇవి ప్రధానంగా నేపాల్, బ్రిటన్, సింగపూర్, కెనడాలకు ఎగుమతి అవుతున్నాయి.

### స్నేహబాల

పిల్లలకి పెద్దలకీ వినోదాన్ని, విజ్ఞానాన్ని కలిగించేకథలు, శీర్షికలతో సచిత్రంగా అందమైన రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో వెలువడిన స్నేహబాల పిల్లల సచిత్ర పక్షపత్రిక మొదటి రెండు ప్రతులూ మా కార్యాలయం చేరాయి. నాయుని కృష్ణమూర్తి సంపాదకత్వంలో వెలువడుతున్న ఈ పుస్తకం విడిప్రతి వెల ఒకరూపాయి. ప్రతులకు : 3, దొరస్వామి గ్రామణిస్ట్రీట్, వడపళని, మద్రాసు–600026 కి వ్రాయవచ్చు.

### నాటికల పోటీలు

లోకమాన్య తిలక్ ఆర్ట్స్ థియేటర్ 21వ వార్షికోత్సవం సందర్భంగా నాటికల పోటీని, నవంబర్ మొదటి మూడు రోజులలో నిర్వహించాలని నిర్ణయించారు వివరాలకు సెప్టెంబర్ నెల ఖరులోగా కె. గంగాధరరావు, వి. జి. తిలక్ ఆర్ట్స్ థియేటర్, వించిపేట, విజయవాడ – 1 కి వ్రాయాలి.

## విషయాలను దాచి అప్పజెప్పే కలం

పరిశోధనలు చేసే శాస్త్రజ్ఞుడు తన పరిశోధనా ఫలితాలను ఎప్పటి కప్పుడు చిన్న చిన్న కాగితపు ముక్కలపై గుర్తులు పెట్టుకొంటూ ఉంటాడు పరిశోధన పూర్తయిన తరువాత ఈ కాగితపు ముక్కలలోని విషయాన్నంతా క్రోడీకరించి మేలు ప్రతి వ్రాసుకోవలసి ఉంటుంది. అందుకని ఈ కాగితపు ముక్కల నన్నిటినీ చాలా భద్రంగా దాచుకోవాలి. వీటిలో ఏ చిన్న కాగితం కనపడక పోయినా పరిశోధకుడు ఇబ్బంది పడతాడు.

ఈ సమస్యను పరిష్కరించటానికి అమెరికాలో ఒక అద్భుతమైన కలం తయారు చేశారు. పరిశోధనా ఫలితాలను చిన్న చిన్న కాగితాల మీద వ్రాసేటప్పుడే, ఆ సమాచారమంతా కలంలోపల ఆటోమాటిక్‌గా నమోదు అవుతూ ఉంటుంది. సిగరెట్ పెట్టె పరిమాణంలో ఉండే ఒక కంప్యూటర్‌కు సన్నని తీగెలతో కలుపబడిన ఈ కలం వ్రాస్తున్న అంకెలు, అక్షరాల ఆకారాలను గుర్తించి ఫలితాలను భద్రంగా తనలో నిలవచేసుకొంటుంది.

ఇలాంటి కలం బ్యాంకులలో పద్దులు వ్రాసేవారికి బాగా ఉపయోగపడుతుంది. కరెంటు మీటర్లు, వాటర్ మీటర్లలోని రీడింగులను నమోదు చేసే వారికి కూడా ఈ కంప్యూటర్ కలం ఉపయోగిస్తుంది

ఈ కంప్యూటర్ కలం ఖరీదు ఒకటి, రెండువందల డాలర్ల కంటె హెచ్చు కాకపోవచ్చునని స్టాన్‌ఫర్డ్ పరిశోధనా సంస్థకు చెందిన శాస్త్రజ్ఞుడు హెవ్లిట్ కేన్ అంటున్నారు.

హిస్ అవుతుంది. శ్రీధర్ ఆవిడను అభినందించవచ్చిన తరుణాన విజయ అతనితో "నేనివ్వాళ ఫస్టుక్లాసు తెచ్చుకున్నానంటే అదంతా నీ ఆశీర్వచనంవల్లనే బావా! ఆ పట్టుదల లేనట్లయితే నేనిలా ప్యాసయి ఉండేదాన్నికాదు! నీ మీద కోపంతో, అసహ్యంతో నిన్ను మర్చిపోలేక ఎం. ఏ. చదవడానికి వైజాగ్

## ఉత్తరాలు

వెళ్లాను. రెండేళ్ల నా ప్రయత్నంలో నిన్ను చాలా వరకు మర్చిపోయాను అంటుంది.

దీన్నిబట్టి విజయ ఎం. ఏ.రెండేళ్ళ చదివినట్టు తెలుస్తూ ఉంది. కాని శ్రీధర్ ఫారిన్‌లో ఉన్న రెండో సంవత్సరం విజయ ఎక్కడ ఏమిచేస్తూ ఉంది ?

తర్వాత ఇంకొక విషయమేమంటే 20.8.76 సంచికలోనే విజయ మెడలోనున్న సూత్రం గొలుసు వేలినున్న ఉంగరం తీసేస్తుంది.

ఇంట్లో తండ్రి, తల్లి, అన్న, నౌకర్లు ఇందరుండగా, మెడలో గొలుసు తీసివేసినసంగతి వదిన జానకి మాత్రమే గుర్తిస్తుంది. ఇరవయినాలుగ్గంటలూ ఇంట్లోనే ఉండి తల్లి, తనకూతురిమెడ బోసిగా ఉండడం గుర్తించలేదా ? సాంప్రదాయమైన కుటుంబంలో ఇది చిన్న విషయంగా తీసుకుంటారా?

కుమారి జి. లత (చీరాల)

### మన సినిమాల్లో తెనుగుభాష

ప్రథమ బహుమతి పొందిన వ్యాసం 'మన సినిమాల్లో తెనుగు భాష" చాలా బాగుంది. వ్యాసకర్త నేడు మన సినిమాల్లో తెలుగుభాష ఎంత దీనస్థితికి దిగజారి పోయిందో తెలియజేస్తూ, "సినిమాల్లో భాషను ప్రేక్షకుల్ని పతనమార్గాల్నుంచి పునీతుల్ని చేయడానికే ఉపయోగించాలి." అంటూ తనభావాలను చక్కగా వ్యక్తీకరించారు. రెండవ బహుమతి పొందిన వ్యాసం కూడా బాగుంది.

'విరుగుడు' కథలో రంగరాజు సమయస్ఫూర్తితో హోటల్ ప్రొప్రయిటర్‌కు బుద్ధివచ్చేలా చేసాడు. వాణిశ్రీగారి "బంధుప్రీతి" కూడా బాగానే ఉంది.

'సామాన్యనిరుగుడు"లో వీరాజీగారు శ్రీ పింగళి వెంకయ్యగారి గుర్చి తెలియజేస్తూ ఆయన కథను మాధ్యమిక పాఠశాలల పాఠ్య గ్రంథాలలో ఒక చిన్న పాఠంగా చేర్చితే బాగుండదా! అన్న వారి సూచన అభినందించదగ్గదే.

భూపతిరామకృష్ణ (పొందూరు)

### ప్రశ్నావళి

"ప్రశ్నావళిలో" నా పేరు జి. జి. ఆర్.కు బదులుగా జి. వి. ఆర్.గా ముద్రించటం నాకు కించిత్ కష్టమనిపించింది.

గురువెళ్ళి గోవిందరావు (ఇజ్జవరం)








Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street,

